

# విషయానుక్రమణిక

## 6 జూన్ 1951


ముఖచిత్రం

ఛాయాచిత్రకారుడు — ముత్తురామలింగం

రాజకీయాలు

రాజ్యాంగ సవరణల విజయం—రావు 1

రాజ్యాంగ నాటకము—సవ్యసాచి 2

ఆసియా పురోగమనం—శ్రీ ఆంద్రూ రాత్ 5

డైరీ— 3

అదీ - ఇదీ— 7

కథానికలు

నామరదళ్ళు—శ్రీ చిట్టూరి రంగకోటేశ్వరరావు 8

కిర్రు చెప్పులు —"రంపా" 12

గ్రామఫోను —శ్రీ ఓగేటి శివరామకృష్ణ 17

శోక కారణం—'కొత్తవాడు' 29

పాపపరిహారార్థం—శ్రీ యస్. లక్ష్మీనరసింహాచార్య 14

నాటికలు

పులిగడ్డ—శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు 9

కామాంధుడు—శ్రీ గోవిందరాజు రామకృష్ణారావు 16

సినిమా

జానపద చిత్రాలు-సాంఘిక చిత్రాలు—శ్రీ ఈ. ? రావు 24

బొమ్మరిల్లు

బెంగుళూరు ప్రయాణం—
శ్రీ అయ్యగారి శ్రీరామచంద్రమూర్తి 38

ఆర్యాచారం—శ్రీ కుమారి పి. శారదాదేవి 40

రాజా-పేదా—మార్క్ ట్వేన్ 32

న్యాయమూర్తి యుక్తి—శ్రీ జయంతి వెంకటేశ్వర్లు 41

గేయం

చందమామ—శ్రీ బులుసు వి. జ. కృష్ణ 31




# ఆంధ్రపత్రిక No. 83

సంవత్సరచందా
రు 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
**Founder: K. NAGESWARA RAO**

సంపుటము 43
సంచిక 38
6-6-51

ఖర సంవత్సర జ్యేష్ఠ శుద్ధ విదియ బుధవారము


# రాజ్యాంగసవరణల విజయం ★ [రావు]

గత పార్లమెంటులో నెహ్రూ ప్రవేశపెట్టిన రాజ్యాంగ సవరణ బిల్లు తాలూకు అన్ని క్లాజులూ ఆమోదించబడ్డాయి ఈ బిల్లుపై పార్లమెంటు లోపలా, వెలుపలా కూడా పెద్ద గాలిదుమారం సాగింది కాని, "పెనుగాలి వీచింది, అణగారిపోయింది," అన్నట్టుగా చివరకు బిల్లు నెగ్గనే నెగ్గింది ఇందులో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు ఈ బిల్లు విజయానికి విఘాతం కలగరాదనే ఉద్దేశంతోనే ప్రభుత్వం దీనిని నెహ్రూచేత ప్రతిపాదింపజేసింది ప్రతిపక్షం లేని పార్లమెంటు అయిఉండినన్నీ ఈ బిల్లును గెలిపించడానికి నెహ్రూ ప్రతిష్ఠను అరువు చ్చుకోవలిసి వచ్చిందంటే బిల్లుపట్ల ఎంత సమ్మతి తల ఎత్తుతుందని అంచనా వేయనదీ ఊహించవచ్చు

కాని, అన్ని విషయాలలోనూ ఆదర్శవాది అయిన నెహ్రూ ఈ బిల్లుకోసరం తన దర్శాలనూ, ప్రతిష్ఠనూ ఏమని వదవనెట్టారో తెలియదు ఈ బిల్లుగురించి పార్లమెంటులోనూ, దేశంలోనూ సాగిన ల్లోలంకంటె అధికమైన కల్లోలం ఆయనలో కలిగినట్లు కనిపిస్తుంది పార్లమెంటు చర్చకు సమాధానం చెబుతూ ఒక అర్ధగంటసేపు నెహ్రూ కోపోద్రేకానికి అకారణంగా గురిఅయిఉన్నట్టు ఒక విలేఖరి తెలిపాడు నెహ్రూకు పూర్వం మాట్లాడిన డా. శ్యామప్రసాద ముఖర్జీ బిల్లును ఆక్షేపించినప్పటికీ ఆయన అసమంజసంగాగాని అసభ్యంగాగాని మాట్లాడలేదు నెహ్రూ తన మనశ్శాంతిని కోల్పోవడానికి కారణం ఆయన అంతరాత్మలో కలిగిన సంక్షోభమే అయిఉండవచ్చు

పైగా నెహ్రూ చెప్పిన సమాధానం ధోరణికూడా వింతగానే ఉన్నది ఈ బిల్లులో పత్రికా స్వాతంత్ర్యానికి విఘాతం ఉన్నదన్నమాట సర్వాబద్ధమని ఆయన అన్నారు ఈ బిలును ప్రతిఘటించేవారందరికీ ఆ సంగతి స్పష్టంగా తెలుసునని కూడా అన్నారు కాంగ్రెసును రాజకీయంగా ప్రతిఘటించగోరేవారు మాత్రమే ఈ బిల్లును విమర్శించారన్న నమ్మకం నెహ్రూను చాలా బాధించినటు కనిపిస్తుంది అయితే ఈ బిల్లుకింద దొరికే అధికారాలను రాగల పార్లమెంట్లు దుర్వినియోగపరచవచ్చునని ఆయన ఒప్పుకున్నారు!

అటువంటి బిల్లును విమర్శించేవారికందరికీ దురుద్దేశాలు అంటగట్టిన నెహ్రూ ఈ బిల్లు విజయానికిగాను జరిగిన చర్యలను విమర్శించి చూసుకోకపోవడం వింతగా ఉన్నది. కొందరు కాంగ్రెసువాదులు ఈ బిల్లుపై తమ అంతరాత్మనుబట్టి వోటు చేస్తామన్నారు వారికైనా ఆ అవకాశం ఇవ్వబడలేదు అట్టివారి సంఖ్య 80 లోపే ఉంటుంది వారందరూ ఈ బిల్లులోని క్లాజులన్నిటికీ వ్యతిరేకంగా వోటుచేసినా బిల్లు నెగ్గివుండేదే ఎందుకంటే బిల్లును ప్రతిఘటించినవారు 20 దాటలేదు దేశక్షేమంకొరకని ప్రతిపాదిస్తున్న బిల్లు విషయంలోకూడా కాంగ్రెసుపార్టీ ఈపాటి విశాలహృదయం చూపలేగు

ఈ బిల్లు సందర్భంలో గుడ్డిలో మెల్లఅని చెప్పుకోదగిన విషయం లేవంటే సవరణల కింద చేయబడే శాసనాలపై అప్పీళ్లకు అవకాశం ఉండడం, క్లాజు వారీగా సభ్యులు వోటు చెయ్యడం, రాష్ట్రప్రభుత్వాలు చేసే శాసనాలను అధ్యక్షుడు ఆమోదించడం మొదలైనవి ఇకముందు అనేక శాసనాలకు గురికానున్న ప్రజలకు ఇది ఏపాటి సంతృప్తి కలిగించేదీ చెప్పడం కష్టం.

రాజ్యాంగ సవరణకు విరుద్ధంగా మాట్లాడినవారు ప్రభుత్వప్రతిపక్షులు కావడం

## గమనిక

కౌంట్-ఆఫ్ మాంట్ క్రిస్టో సీరియల్ కారణాంతరాల చేత ఈ వారం నిలిపివేయవలసి వచ్చింది. పై వారంనుండి అది యథాప్రకారం ప్రచురింపబడునని మనవి.

—సంపాదకుడు

# రాజ్యాంగ నాటకం



(స్థలం పార్లమెంటు సమావేశం ప్రధాని నెహ్రూ ఉపన్యసిస్తున్నారు)

నెహ్రూ:

ప్రపంచ రాజకీయ పరిస్థితులు నాకు
తెలిసినంత బాగా తెలియవు మీకు
మానవుడు క్రాస్ రోడ్లవద్ద నుంచున్నాడు;
దారి తెలియక తికమక పడుతున్నాడు
అంచేత మనం రాజ్యాంగం సవరించాల్సి వుంటుంది;
నే చెప్పిందానికి మీరు 'ఊ' కొట్టాల్సి వుంటుంది
కాలం మారిపోతోంది,
దేశం పురోగమిస్తోంది
మన అవసరాలు మారిపోతున్నాయి.
ఎన్నికలు దగ్గర పడుతున్నాయి
ఈ కొత్త పరిస్థితుల్లో ఇంకా మీరు
పాత సిద్ధాంతాలే వల్లిస్తున్నారు
మార్చటానికి వీల్లేని రాజ్యాంగం
దేశక్షేమానికి కలిగిస్తుంది భంగం

సభ్యుల కోరస్

దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే కాంగ్రెసోయ్

దేశబంధు గుప్త

పత్రికల స్వాతంత్ర్యాన్ని అరికట్టడం
వల్ల కూలిపోదా ప్రజాస్వామ్య కట్టడం ?

నెహ్రూ

మన పత్రికలకి స్వాతంత్ర్యమంటే తెలీదు

ఫ్రాంక్ ఆంథోనీ:

ఇండియాకి డెమొక్రసీ అర్థం కాలేదు.
నియంతృత్వ మొకటే మనకు శరణం
కనుక బలపరుస్తున్నా నీ సవరణం

కృపలానీ:

రాజ్యాంగాన్నిప్పుడు మార్చవలసిన అవసరం ?

దేశబంధుగుప్త:

ఇంత వేగంగా మార్చవలసిన కారణం ?

నెహ్రూ (చర్చను ముగిస్తూ)

రాజ్యాంగాన్ని గౌరవించవలసిందే
రాజ్యాంగం అంటూ ఉంటం మంచిదే
అయితే అది ప్రభుత్వాల కెదురు తిరిగితే
విధిగా దాన్ని సవరించవలసిందే
అంతర్జాతీయ పరిస్థితి విషమిస్తోంది
కనుక మద్రాస్‌లో కమ్యూనల్ జి ఓ అవసరమైంది.
మనకు ప్రధాన శత్రువు కాదు కమ్యూనలిజం.
మనకు నిజమైన శత్రువు కమ్యూనిజం

స్పీకరు:

బిల్లు మెజారిటీ బలంతో గెలిచింది;
పార్లమెంటుతో అవసరం తీరిపోయింది

సభ్యుల కోరస్: (నెహ్రూ నుద్దేశించి)

జనగణమన అధినాయక జయహే
భారత భాగ్య విధాతా
పంజాబ్ సింధు .

(తెర)

— సవ్యసాచి —

వల్ల నెహ్రూగారు వారి వాదాలు అసమంజసంగా తోచిఉండవచ్చుగాని ప్రతిపక్షం సాధ్యమైనంతవరకు ప్రభుత్వ పక్షానికి అనుకూలించని నిజం చెప్పడానికి "సంకోచించరు ఈ బిల్లును విమర్శించుతూ డా శ్యామప్రసాదముఖర్జీ, కృపలానీ మొదలైన వారు చెప్పిన విషయాలు గమనించదగినవి

డా శ్యామప్రసాదముఖర్జీ శనివారం నాడు మాట్లాడుతూ ప్రాథమిక హక్కులను స్పృశించవలసిన అగత్యం కలగలేదని పునరుద్ఘాటించారు అశ్లీల అసభ్యరచనలు వగైరాలను శిక్షించడానికి తగిన చట్టాలు అమలులో ఉన్నాయని ఆయన వాదించారు. పార్లమెంటులోని కాంగ్రెసువారందరిదీ ఒకే గొంతు అనీ బిల్లను ప్రతిఘటించేవారందరిదీ తలా ఒక గొంతు అనీ, అందుచేత ప్రతిఘటించేవారే అధికసంఖ్యాకులనీ ముఖర్జీ అన్నారు ఆయనే బుధవారంనాడు పార్లమెంటులో ప్రసంగిస్తూ ఈ విధంగా అడిగారు

"ఈ ప్రయత్నాన్ని దేశంలో అనేకమంది ఎందుకు ప్రతిఘటించుతున్నారని ప్రశ్నిని అడుగుతున్నాను రాజకీయాలతో సంబంధం లేనివారుకూడా దీనిని ఎందుకు ప్రతిఘటించుతున్నారు ?"

బుధవారంనాడే పార్లమెంటులో ప్రసంగిస్తూ కృపలానీ ఈబిల్లును చాలా తీవ్రంగా విమర్శించారు జమీందారీల రద్దుకు అను

(48-వ పేజీ చూడండి)




సోమవారం, మే 28.

—కాంగ్రెస్‌నుండి వైదొలగిన కాంగ్రెసు వాదులు నూతన రాజకీయపక్షం స్థాపించే నిమిత్తం జూన్ 16, 17 తేదీల్లో పాట్నాలో మహాసభ జరుపుతారు

—ఇండొనీషియాలో భారత రాయబారిగా పనిచేస్తున్న డా॥ సుబ్బరాయన్ రాజీనామా ఇచ్చినట్లు నెహ్రూ ప్రకటన

—విజయవాడ రేడియో స్టేషన్ డైరెక్టరు ఎస్ రాజగోపాల్ గారిని హైదరాబాదుకు బదిలీచేసి, విజయవాడకు డా॥ అయ్యగారి వీరభద్రరావుగారిని నియమించారు

—టిబెట్టుకు చైనాలో ఒక రాష్ట్రంగా స్వపరిపాలనాధికారం ఇస్తూ పెకింగ్ ప్రభుత్వం లాసాతో ఒడంబడిక చేసుకున్నట్టు గత రాత్రి ప్రకటన జరిగింది దలైలామా ప్రభుత్వాధిపతిగాను, పాంచెన్ లామా ఆధ్యాత్మిక నాయకుడుగాను వ్యవహరిస్తారు

—ఈఏడు నవంబరు, డిసెంబరు నెలల్లో ఎన్నికలు జరిపి తీరాలని ప్రభుత్వం పట్టుదలగా ఉన్నట్లు పార్లమెంటులో డా॥ అంబేద్కర్ ప్రకటించారు.

—ఈనెల 26 వ తేదీరాత్రి కొందరు పాకిస్థానీలు పాకిస్థాన్ సరిహద్దుకు దాపులో వున్న కాశ్మీర్ ప్రాంతంపై దాడిచేసి పదిమందిని తుపాకులతో కాల్చి చంపినట్లు జమ్మూనుంచి వార్త

—కొరియాలో కమ్యూనిస్టు లుపయోగిస్తున్న రష్యన్ రకం ఎమ్ ఐ జి 15 జెట్ విమానానికి ఉన్న ఇంజన్ అమెరికాలో తయారయ్యే జెట్ ఇంజన్ కంటే శ్రేష్ఠమైనదని అమెరికా విమానబాధ్యతుడు వాండెన్‌బర్గు ప్రకటించాడు

—హైద్రాబాదునుంచి వచ్చిన 20 మంది కమ్యూనిస్టు ప్రముఖులను అనకాపల్లిలో అరెస్టు చేశారు

—తెలంగాణా ప్రాంతంనుండి సాయుధ కమ్యూనిస్టులు ఒరిస్సాలోని కోరాపుట్టి జిల్లాలోకి రహస్యంగా ప్రవేశించినట్లు కటక్ వార్త

—బ్రిటన్‌తో తనకుగల నూనె తగాదాను పరిశీలించే అధికారం అంతర్జాతీయ న్యాయస్థానానికి లేదని పర్షియా అభిప్రాయ పడుతున్నట్లు పర్షియన్ ప్రభుత్వం హేగ్‌లోని న్యాయస్థానానికి కేబుల్ సందేశం పంపింది

—కొరియాయుద్ధంలో ఇప్పటివరకూ అమెరికన్లకు సంభవించిన జననష్టం 1,51,995 అని మాస్కో రేడియో ప్రకటించింది

—వచ్చే ఆగస్టు 15 కైనా ఆంధ్ర రాష్ట్రము ఏర్పడాలని, లేనిచో వచ్చే ఎన్నికల్లో కాంగ్రెస్‌తో పోటీచెయ్యాలని బందరులో నిన్న జరిగిన భాషారాష్ట్ర సమితి ఆంధ్రశాఖవారి బహిరంగసభలో తీర్మానం చేయబడింది

మంగళవారం, మే 29.

—రాజ్యాంగంలోని 15 వ సూత్రానికి ప్రతిపాదించబడిన సవరణనుగూర్చి పార్లమెంటులో నెహ్రూ ప్రస్తావిస్తూ, వెనుకబడిన కొన్ని తరగతులకు, కులాలకు మద్రాసు ప్రభుత్వం ఏర్పాటుచేసిన సౌకర్యాలను రాజ్యాంగవిరుద్ధమని కోర్టులు తీర్పు చెప్పటంవల్లనే ఈ సవరణ ప్రతిపాదించబడిందని చెప్పారు

—దక్షిణాఫ్రికాలో మలాన్ ప్రభుత్వంఓటింగులో ప్రవేశపెట్టదలచిన జాతి విచక్షణా విధానానికి నిరసనగా కేప్‌టౌనులో ప్రదర్శనలు జరిగాయి ఈ సందర్భంలో పోలీసులకూ, ప్రదర్శకులకూ జరిగిన సంఘర్షణలో పలువురు తీవ్రగాయాలకు లోనయ్యారు

—మద్రాస్ సెక్రటేరియట్ వద్ద సత్యాగ్రహము చేయుటకై నగరంలోని వివిధప్రాంతాలనుండి బయల్దేరిన 111 మంది చేనేతవారిని అరెస్టుచేశారు నిన్న ఉదయం అరెస్టయిన 80 మందిని రాత్రికి వదిలిపెట్టారు ప్రస్తుత పరిస్థితిలో చేనేతవారు సత్యాగ్రహం చేయటం బాగాలేదని, మానివేసి ప్రభుత్వంతో సహకరించాలని మద్రాసు చేనేత సహకార సంఘాధ్యక్షుడు యం సోమప్ప ప్రకటించారు

—"ఇతర విషయాలు సంతృప్తికరంగా ఉన్నట్లయితే పర్షియన్ నూనె పరిశ్రమను జాతీయంచేసే పద్ధతి విషయమై పరిష్కారం చేసుకోడానికి బ్రిటన్ సిద్ధంగా వున్నది," అని బ్రిటిష్ విదేశాంగమంత్రి హెర్బర్ట్ మోరిజన్ కామన్సుసభలో వెల్లడించారు నూనె కంపెనీ డైరెక్టర్లతో చర్చించడానికి పర్షియా ప్రధాని సమ్మతించారు నూనెగని ప్రాంతమైన ఖుజీస్థాన్ రాష్ట్రంలో 'మార్షల్‌లా' మరో రెండు నెలలదాకా పొడిగింపబడింది

—రాష్ట్రాలకు ఇచ్చే గుడ్డల కోటాలను 1951 జనాభా లెక్కలనుబట్టి సవరించడానికి, ప్రస్తుత మిల్లులకు తమ ఇష్టం వచ్చినవారికి అమ్ముకోడానికి, వాటి ఉత్పత్తిలో అనుమతిస్తున్న స్వేచ్ఛా వ్యాపారపు కోటాలను మూడోవంతునుంచి 5 వ వంతుకు తగ్గించడానికి భారత ప్రభుత్వం నిశ్చయించింది

—అగ్రరాజ్య చతుష్టయ విదేశాంగ మంత్రుల ప్రతినిధులు పారిస్‌లో 63 వ సారి సమావేశమయ్యారు కాని, అట్లాంటిక్ ఒడంబడికను విదేశాంగమంత్రుల సభ ఎజెండాలో చేర్చాలని రష్యన్ ప్రతినిధి గ్రోమికో చేసిన సూచనకు పశ్చిమరాజ్య ప్రతినిధులు ప్రతికూలించారు.

—కాశ్మీరులో రాజ్యాంగ పరిషత్తును స్థాపించడానికి జరుగుతున్న ప్రయత్నాల పట్ల భద్రతామండలి సభ్యులకు కలుగుతున్న ఆందోళనను ఇండియా ప్రభుత్వానికి తెలుపవలసిందిగా మండలి తన అధ్యక్షుని ఆదేశించింది ఇలా తెలుపవలసిందని భద్రతామండలిలో బ్రిటిష్‌ప్రతినిధి సర్ గ్లాడ్విన్ జెబ్ ప్రతిపాదించగా మండలిదాన్ని ఆమోదించింది

—సూడాన్ విషయమై ఈజిప్టు కోరిన కోర్కెను బ్రిటన్ మన్నించకపోతే 1936 సం॥పు ఆంగ్లో—ఈజిప్షియన్ మిత్రత్వసంధిని, సూడాన్ విషయమై ఉభయదేశాలు 1893 సం॥న చేసుకున్న ఒప్పందాన్ని ఈజిప్టు తిరస్కరిస్తుందని ఈజిప్టు విదేశాంగ మంత్రి ప్రకటించాడు

—ఈ సింగ్టన్ కౌంటీ (డర్‌హాం, ఇంగ్లండు)లోని బొగ్గుగనిలో ప్రేలుడు సంభవించి, 900 అడుగుల ఎత్తుగల పైకప్పుకూలి దాదాపు 80 మంది భూగర్భంలో చిక్కుకు పోయారు

—జపాన్ సంధిపత్రంపై జులై నెలలో సంతకాలు జరగవచ్చని ఆస్ట్రేలియా ప్రభుత్వానికి తెలుపబడింది

—కొరియా యుద్ధంలో మే 18 వ తేదీ వరకూ నష్టమైన సమితి యుద్ధ విమానాలు 212 అనీ, కమ్యూనిస్టువిమానాలు 149 అనీ అమెరికన్ సెనేటరు విలియంనోలాండు ప్రకటించాడు

—ఇండియా, పాకిస్థాన్‌లను తిరిగి ఏకం చేసి ముస్లిం పరిపాలన కిందికితెచ్చే ఉద్దేశ్యంతో ఇటీవల కరాచీలో ఏర్పడ్డ 'హిందూస్థాన్ హమారా పార్టీ'పై తీవ్ర చర్య తీసుకోవలసిందని ఇండియా ప్రభుత్వం పాకిస్థాన్ ప్రభుత్వాన్ని కోరింది

—ఇండియా, పాకిస్థాన్‌లమధ్య పరిష్కారం కాకుండా నిలిచివున్న ఆర్థిక సమస్యలను చర్చించడానికి గత శుక్రవారంనుంచీ న్యూఢిల్లీలో జరుగుతున్న ఉభయదేశ ప్రతినిధుల సమావేశం ఎట్టి ఒప్పందానికి రాకుండానే ముగిసింది

—కేంద్ర రాకపోకల సౌకర్యాలశాఖకు కొత్తగా డిప్యూటీమంత్రిగా నియమితులైన ఆర్ వి రాజబహదూర్ పదవీప్రమాణం చేశారు

—కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మంత్రులు సొంత పనులమీద బయటి ఊళ్లకు వెళ్లవలసివస్తే ఖర్చులు తామే భరించాలని తెలియజేయబడింది

## బుధవారము, మే 30:

—ఆజాద్ హింద్ ఫౌజులో ఆఫీసర్లుగా ఉన్న 7 గురికి, జె సి ఓ మొదలైన హోదాల్లో ఉన్న 1,038 మందికి భారత ప్రభుత్వం తిరిగి ఉద్యోగాలిచ్చినట్టు రక్షణ ఉపమంత్రి మేజర్ జనరల్ హిమ్మత్ సింగు చెప్పారు

—చైనాతో నేపాల్ రాయబార సంబంధాలేర్పరచుకోవాలని నేపాల్ మంత్రివర్గంలోని కాంగ్రెస్ మంత్రులు పట్టుబట్టాలని కోరుతూ నేపాల్ కాంగ్రెస్ కార్యవర్గం తీర్మానించింది

—గ్రామప్రాంతాల్లో వున్న కచ్చారోడ్లను గ్రామస్థుల సహకారంతో అభివృద్ధ చేసేందుకు భారతప్రభుత్వం 15 లక్షలు కేటాయించి నమూనా ప్రణాళిక తయారుచేసింది

—బ్రిటన్‌కుగల పెట్రోలు అవసరాలపై బ్రిటిష్ ప్రభుత్వంతో సంప్రదించటానికైతే పర్షియా ప్రభుత్వం సిద్ధంగా ఉందని, అంతేగాని నూనె తగాదాతో బ్రిటిష్ ప్రభుత్వానికి సంబంధమున్నట్లు పరిగణించదని పర్షియా ప్రభుత్వం ప్రకటించింది

—బ్రిటిష్ యుద్ధనౌక 'మరీషియస్'ను పర్షియా కోస్తా సమీపంలో నిలిపిఉంచటానికి బ్రిటిష్ నౌకాశాఖ నిశ్చయించింది

—ఉత్తర కొరియాలోని కమ్యూనిస్టు సేనలు నిలవదొక్కుకుని సమితిసేనల పురోగమనాన్ని నిరోధించాయి హ్వాచాన్ పశ్చిమానగల అమెరికన్ సేనలు ఈ తాకిడి తాగలేక తిరోగమించాయి

—చేనేత సత్యాగ్రహులను 83 గురిని అరెస్టు చేశారు నిన్న అరెస్టయినవారిని రాత్రి 9 గం కు విడుదలచేశారు. సత్యాగ్రహం విరమించాలని మాచాని సోమప్పగారు చేసిన ఉద్బోధను ఖండిస్తూ గుంటూరు, ఆకివీడు చేనేత సహకార సంఘాధ్యక్షులు ప్రకటనచేశారు

—ఈఏడాది జనాభా లెక్కలుతయారు చేయడానికి 150 లక్షల రూ లు ఖర్చు కావచ్చునని, ఈ వ్యయాన్ని కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు సమంగా భరించాల్సి వుందని మంత్రి రాజగోపాలాచారిగారు పార్లమెంటులో చెప్పారు

—సోవియెట్ యూనియన్, చైనాలతో సాంస్కృతిక సంబంధాలను పెంపొందించే నిమిత్తం పర్యటన గావించాలని భారతప్రభుత్వం సుప్రసిద్ధ నటకుడు పృథ్వీరాజ్ కపూర్‌ను కోరింది

## గురువారం, మే 31:

—చేనేత సత్యాగ్రహం 46 వ రోజైన నేడు 164 గురు అరెస్టయ్యారు నిన్న అరెస్టయినవారు రాత్రి 10 గం కు విడుదల చేయబడ్డారు

—రాజ్యాంగంలోని 368 వ సూత్రాన్ని అనుసరించి సవరణ బిల్లులోని ప్రతీ క్లాజును, సవరణలను విడివిడిగా వోటింగుకు పెట్టడం అవసరమని స్పీకర్ జి వి మాలంకర్ రూలింగు ఇచ్చారు.

—ఇండియా, రష్యాలమధ్య ఇటీవల జరిగిన ఒప్పందం ప్రకారం దాదాపు 6,695 టన్నుల రష్యన్ గోధుమలు 'క్రాస్నడోర్' అనే నౌకలో బొంబాయి చేరాయి రష్యన్ గోధుమలు మనదేశానికి రావడం ఇదే మొదటిసారి

—ఆంధ్రప్రదేశ కాంగ్రెసు సర్వసభ్య సమావేశం విశాఖపట్టణంలో ప్రారంభమైంది నీలం సంజీవరెడ్డిగారు అధ్యక్షత వహించి, కాంగ్రెసు కార్యక్రమాన్ని అమలు జరపటానికి పట్టుదలతో పనిచేయాలని సభ్యులను ఉద్బోధించారు. టి లక్ష్మిరెడ్డి (అధ్యక్షుడు), సామవేదం సత్యనారాయణ, బలభద్రపాత్రుని, కనకసుందరం గార్లతో ఎన్నికల ట్రిబ్యునల్ ఏర్పాటైనది.

—హైద్రాబాదు కమ్యూనిస్టులు అనకాపల్లిలోకి ప్రవేశించారను వార్త ప్రభుత్వమును వంచించుటకు చేసిన పుకారు మాత్రమేనని అధికారవర్గాలలో విచారించగా తెలియవచ్చింది.

## శుక్రవారం, జూన్ 1:

—38 వ అక్షాంశరేఖ దరిదాపుల్లో వున్నప్రాంతం సరిహద్దుగా కొరియాలో ఉభయపక్షాలు యుద్ధవిరమణకు అంగీకరించేటట్లు త్వరలో మరో ప్రయత్నం చెయ్యాలని సమితికార్యదర్శి ట్రిగ్వేలీ ప్రకటించాడు ఈ ప్రయత్నం ఫలించకపోతే కొరియాకు ఐక్యరాజ్యాలు అదనపు బలాలను పంపించాలనికూడా ఆయన అన్నాడు.

—నూనె తగాదాను సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకోవలసిందని అధ్యక్షుడు ట్రూమన్ బ్రిటన్, పర్షియా ప్రధానులకు వ్యక్తిగతంగా సూచన చేశాడు సంప్రదింపులకోసం ప్రతినిధివర్గాన్ని పంపుతామని బ్రిటిష్ విదేశాంగ మంత్రి చేసిన సూచనకు పర్షియా ప్రధాని విముఖత చూపాడు

—రాజ్యాంగ సవరణబిల్లులో వాక్ భావస్వాతంత్ర్యాలను అరికట్టడానికి శాసనసభలకు అధికారమిస్తున్న క్లాజు, జమీందారీల రద్దుకు సంబంధించిన క్లాజు, వెనకబడిన జాతుల సౌకర్యాలను గూర్చిన క్లాజు మున్నగు ప్రధానమైన వాటిని పార్లమెంటు ఆమోదించింది ప్రస్తుత పార్లమెంటు సమావేశం జూన్ 9 తో అంతమవుతుందని నెహ్రూ ప్రకటన.

—11 లక్షల టన్నుల గోధుమలు, 6 లక్షల 35 వేల టన్నుల మైలో ఈఏడాది అమెరికానుంచి దిగుమతి చేసుకోవాలని అనుకుంటున్నట్లు ఆహారమంత్రి మున్షీ ప్రకటించారు

—పాకిస్థాన్, ఫక్తూనిస్థాన్ సేనలకు మే 23 న మూడుగంటలసేపు యుద్ధం జరిగినట్లు కాబూల్ రేడియో ప్రకటించింది

—ఇటీవల సూడాన్ ప్రతినిధులతో జరిగిన చర్చలఫలితంగా సూడాను నుండి 60 వేల బేళ్ల ప్రత్తిని దిగుమతిచేసుకొనుటకు, దీనికి బదులుగా సూడానుకు జనపనారవస్తువులు ఎగుమతి చేయుటకు ఇండియా ప్రభుత్వం ఒప్పందంచేసుకుంది

(47-వ పేజీ చూడండి)

# ఆసియా పురోగమనం

★ [ఆంధ్రారాత్]

రెండవ ప్రపంచ యుద్ధం సమసిపోయిన తదాదీ ఆసియాలో ఇంతింత తీవ్రమైన మార్పులు వచ్చాయనటానికి వీల్లేదు—వాటి తాకిడితో ప్రపంచ వ్యవస్థ గ్రక్కదలిపోతోంది ఈపరిణామాల స్వరూపాన్ని, ఆయా వర్గాలవారు వారివారి మనస్థితులను బట్టి అవగాహన చేసుకుంటున్నారు ఆసియాలో జరుగుతున్న కమ్యూనిస్టు పురోగమనాన్ని చూసి, ఇవన్నీ అమాయకులూ, అజ్ఞానులూ అయిన ప్రజలమీద నెరపబడుతున్న దౌర్జన్యాలుగానూ, అమెరికనువర్గాలవారుఅనుకుంటున్నారు ఇదంతా స్టాలిన్ అడుగుజాడల్లో నడుస్తూ ఆసియా కార్మికవర్గాలు వేస్తున్న ముందడుగుగా సోవియట్ వర్గాలవారు అంచనా వేస్తున్నారు ఏవో చిన్న ఒడుదుడుకులు వస్తున్నాయనీ ఆర్థికంగానూ, సాంఘికంగానూ కొంచెం యిటూ అటూ సర్దుబాటు చేస్తే తీరిపోతుందని బ్రిటిష్ పరిపాలకులనుకుంటున్నారు

దూరానవుండి చూచేవారికి ఇలాంటి దుర్భ్రమలు కలగటంలో విపరీతమేమీలేదు కాని ఈ కల్లోలాలు సాగుతున్న తరుణంలో ఆసియాలో పరిభ్రమించుతూ ఈ సంఘటనలన్నిటినీ కళ్ళారా చూచి అవగతం చేసుకున్న విలేఖరి ఎవ్వడూ అలాంటి పొరపాటు పడటానికి సావకాశం లేదు ఈ చారిత్రాత్మక పరిణామాల్ల మధ్య తీవ్రమైన నిర్ణయాలు చేసుకోవలసి వచ్చి, వ్యాకులపాటు చెందిన అనేక మంది ప్రముఖుల స్వరూపాలు మన మనస్సులో ఏనాటికి స్ఫురద్రూపంతో మెలగుతూనే యుంటై ఆయా సంఘటనల తరుణంలో ఆయా వ్యక్తులతో జరిపిన సంభాషణలు, అప్పటికేమీ అంత ప్రధానమైనవిగా కనుపించక పోయినా, ఈనాడుఅదేభవిష్యత్తులోకి చూడటానికి తగిన దుర్భిణులుగా ఉపకరించుతున్నయ్

ఒకనాడు ఆయనా, నేనూ, పచ్చికబయలు మీద హాయిగా పడుకున్నాం. దూరాన బాంకాక్ నగరంలోని దేవాలయ గోపురాలు కనుపించుతున్నయ్ "స్వతంత్ర కాంబోడియా" గెరిల్లాల దళాల నాయకుడు- ఆయన కార్మిక వర్గాలకు చెందిన వాడుకాదు. ఒక రాచవంశంలో పుట్టిన వాడే-నావంక చూచి ఇలా అన్నారు

'మాకు కావలసిందిస్వాతంత్ర్యం-(చైనా) కమ్యూనిస్టు యూనాన్ పరిహద్దుకు వచ్చి (ఇండో-చీనా) హోచిమిన్ వర్గాలకు యే మాత్రం ఆయుధ సహాయం చేసినా- రెండు మాసాల్లో ఫ్రెంచి వాళ్లను యీ గడ్డమీద నుంచి తుడిచి వేస్తారు కాని దానివల్ల హోచిమిన్ ప్రభుత్వం కమ్యూనిస్టు ప్రభుత్వంక్రింద మారిపోవలసి వస్తుంది అలాంటి ప్రమాదమున్నా ఫ్రెంచివాళ్లను తరిమివెయ్యటానికి వాళ్లు మాకు ఆయుధాలిస్తామంటే తప్పకుండా స్వీకరించుతాం బ్రిటిష్, అమెరికన్, సయాం అధికారులచుట్టూ సంవత్సరాల తరబడి కాళ్లు ఒలపాలు కట్టేలా తిరిగాను మా స్వాతంత్ర్యోద్యమానికి సాయపడమని అర్థించాను కాని లాభం లేకపోయింది కమ్యూనిస్టుల దగ్గరనుంచికంటే, ప్రజాస్వామిక రాజ్యాలనుంచే మాకు సహాయం లభించితే బాగుండేది కాని వారంతా మామీద సీతకన్ను వేసి ఉపేక్షించి ఊరుకున్నారు ఫ్రెంచి అధికారాన్ని ప్రతిఘటించటానికి మాకు యేతావునుంచి సహాయం లభించినా స్వీకరించుతాం. వారిపట్ల కృతజ్ఞులమై వుంటాం

ఈ సంభాషణ 1948 నవంబరులో జరిగింది ఈ కాంబోడియన్ రాచబిడ్డ హోచిమిన్ విజయం సునాయాసంగా లభించుతుందనుకోటంలో పొరపాటు అంచనా యే వేశాడు ఫ్రెంచివారి తాలూకు బావ్ దాయ్‌కి మద్దతుగా అమెరికా జోక్యం కల్పించుకుంటుందని ఆయన అప్పట్లో ఊహించలేకపోయాడు. కాని హోచిమిన్ ప్రభుత్వానికి చైనా ఆయుధాలు అందచేస్తే కలిగే ఫలితాలను గురించి మాత్రం ఆయన నూటికి నూరుపాళ్లు సరిగా యోజించగలిగాడు

ఈ హెచ్చరిక వచ్చిన సంవత్సరానికే ఇండో-చైనాలోని సంకీర్ణ ప్రభుత్వం పూర్తిగా కమ్యూనిస్టు ఆధ్వర్యం క్రిందికి వెళ్లిపోయింది ఈ ప్రభుత్వాన్ని పెకింగ్ మాస్కోలు రెండూ గుర్తించినాయి మరో అర్థ సంవత్సరానికి ఆయన తాలూకు 'స్వతంత్రకాంబోడియా' పక్షం కూడా హోచిమిన్ వర్గాలతో కలిసి పోవలసివచ్చింది అనురుతుణాన్నుంచీ ఆయనిక పశ్చిమ రాజ్యాలను హెచ్చరించే ప్రమేయం మానుకున్నాడు. చైనానుంచి అందిన ఆయుధాలతో ఆయన తాలూకు గెరిల్లా దళాలుకూడా హోచిమన్ దళాలతో భుజాలుకలిపి, అమెరికా నుంచి ఆయుధాలుపొందిన ఫ్రెంచివారి దళాలమీద దెబ్బతియ్యటానికి ఉపక్రమించాయి

1948 డిశంబర్ లో 'అమెరికా చియాంగ్ వర్గాన్ని మద్దతుచేయటం కేవలం, చైనాను పట్టుబలవంతాన కమ్యూనిస్టుల చేతుల్లోకి తోసి వేయటం అని మార్షల్ లీచీసేన్ హెచ్చరిక చేశారు చియాంగ్ ప్రభుత్వం తాలూకు పీడనవల్లనే చైనాలో కమ్యూనిస్టుల సంఖ్య పెరుగుతోంది నిజంగా, అమెరికాకు చైనాలో కమ్యూనిజం పెరగరాదనే ఉద్దేశంవుంటే, చియాంగ్ ను మద్దతుచేయడం మానాలి, అని తీవ్రంగా హెచ్చరించారు. అదంతా చివరికి చెవిటివాడి దగ్గిర శంఖు ఊదినట్టయింది

కమ్యూనిస్టులు పెకింగ్ లో ప్రభుత్వాన్ని నెలకొల్పుతున్న మొదటిరోజుల్లో, నేను, స్థానిక విశ్వవిద్యాలయంతాలూకు రాజకీయ శాఖ ప్రధానాచార్యులను ఒకర్ని కలుసుకున్నాను పాశ్చాత్య పరిభాషలో చెప్పాలంటే, ఆయన నిజంగా చాలా మితవాది. కొమింగ్ టాంగ్ ప్రతినిధిగా లోగడ అనేక పర్యాయములు అంతర్జాతీయ సమావేశాల్లో పాల్గొన్నారు ఆయన అమెరికాలో 2సం॥లు పర్యటించి అప్పుడే యింటికి తిరిగివచ్చారు చైనాపట్ల అమెరికా అవలంబించుతున్న అవకతవకలనన్నిటినీ, అస్థందర్భాలనన్నిటినీ ఆయన ఖుద్దున అవగతంచేసుకుని వచ్చారు

1949 ఫిబ్రవరిలో ఒకనాడు ఆయనతో కలిసి టీపుచ్చుకున్నాను కమ్యూనిస్టులమంచి చెడుగులను ఆయన గురించి చర్చించటానికి అంత సముఖుడుగాలేరు 'పరులమీద ఆధారపడి ప్రతికే జలగలక్రింద మమ్మల్ని ప్రపంచం లెక్కకట్టడం నాకు చాలా సంతాపకరంగా వుంది కమ్యూనిస్టులు కనీసం, నీతిబాహ్యం కాని బలమైన ప్రభుత్వాన్నైనా నిర్వహించగలరు' అన్నారు యుద్ధరంగంలో డొక్కముక్కలుతిని రాటుతేలిన కమ్యూనిస్టు దళాలు నడివీధిలో కవాతుగా వెడుతూంటే, గర్వంతో ఆయన హృదయం ఉప్పొంగిపోవటం నేను గమనించాను. ఇన్ని రోజుల నుంచి చిన్నచూపు చూడబడుతున్న చైనా పరిస్థితి, ఆ బలాలతో యెట్టి మహోజ్వల స్థితిని అందుకోగలదో ఆయన కట్టెదుట కనుపించుతున్నట్టు ముఖం విప్పారింది అప్పటికి ఆయన ఇంకా కమ్యూనిస్టులు తన్ను మిత్రుడుగా అంగీకరించుతారా లేదా అనే సందేహావస్థలోనే వున్నారు.

రెండు సంవత్సరాలు గడిచినై ఆయన పెకింగ్ రాజకీయ వర్గాలలో ప్రధాన స్థానం వహించారు పెకింగ్ రేడియో కేంద్రం ఆయన అభిభాషణలను పదే పదే ఉటంకించటం మొదలు పెట్టింది

* * *

1949 మే - సేవ్రూల్ నగరంలో స్థానిక విశ్వవిద్యాలయం తాలూకు, ఆంగ్ల సారస్వత శాఖ ప్రధానాచార్యులను కలుసుకున్నారు. ఆయన కొరియా జాతీయుడే అయినా కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో చదువుకున్న విజ్ఞానవంతుడు తన దేశానికిపట్టిన దుర్గతికి

ఆయన పడిన ఆవేదన నాహృదయాన్ని కలచివేసింది పశ్చిమ రాజ్యాలు ఇక్కడ నా దేశంలో ఇలా పోలీసు రాజ్యం స్థాపించటం దుర్భరం—ఉత్తర కొరియాలో వున్నది కూడా పోలీసు రాజ్యమే, అయినా దీనికంటే చాలానయం అవినీతిలేదు కొంచెం పురోగమన దృష్టివుంది' అన్నారు

సేవ్రూల్ కమ్యూనిస్టుల చేజిక్కినప్పుడు ఆయన కమ్యూనిస్టులకు సహాయంగా రేడియో కేంద్రంలో పనిచేశారు తిరిగి సేవ్రూల్ ను అమెరికావాళ్లు పట్టుకున్నప్పుడు ఆయన ఖైదీగాచిక్కి అనంతరం తప్పించుకు పారిపోయారు తరువాత నేను మరొక కొరియన్ మిత్రుణ్ణి కలుసుకున్నప్పుడు ఆయన్నుగురించి భోగట్టా అడిగితే ఆ మిత్రుడు నాకో విచిత్రమైనమాట చెప్పారు

"మా దేశంలో పెద్దమనిషి అయినవాడికి యెవ్వడికైనా రెండేమార్గాలు - తప్ప తాగి మత్తైనా చెరుచుకోవాలి లేదా కమ్యూనిస్టుగా అన్నా మారిపోవాలి మరో గత్యంతరం లేదు అన్నారు"

అనంతరం మరో సంవత్సరం పోయిన తరువాత టెహ్రాన్ నగరంలో ఒక పర్షియన్ యువకుణ్ణి కలుసుకున్నాను ఆయనతో మాట్లాడిన తరువాత, ఆసియాలో బాగా చదువుకుని సాంఘిక చైతన్యాన్ని సముపార్జించుకున్న యువకులందరి మనస్థితీ యెలా వున్నదో నేను తేలికగా అర్థం చేసుకోగలిగాను ఈ యువకుడు, పర్షియాలోని రెండువందల రాజకుటుంబాల్లోనూ ఒకదానికి చెందినవాడు ఆయన ఆదిలో కమ్యూనిస్టుల అధ్వర్యాన నడుస్తున్న టూండే పార్టీలో చేరారు పర్షియా అధునాతన సామ్రాజ్యంగా ప్రభవించాలంటే, అంతకంటే గత్యంతరం లేదని ఆయన అనుకున్నారు కాని ఆ పార్టీ నాయకులు ప్రతి చిన్న విషయానికి మాస్కో ఉత్తరువుల కోసం ఎదురుచూస్తూ వుండటం చూసి విసుగెత్తి ఆ పార్టీనుంచి విరమించుకున్నారు

ఆదినుంచి పశ్చిమరాజ్యాల దృక్పథంపట్ల మొగ్గగలవాడేఅయినా 1950 వచ్చేసరికి ఆయనకు పశ్చిమ రాజ్యాలయందు విశ్వాసం సన్నగిలి పోయింది పర్షియాలో, తాను వాంఛించుతున్న తీవ్ర సంస్కరణలు రావడానికి పశ్చిమ రాజ్యాలు అంగీకరించలేవనే అభిప్రాయం ఆయనకు కలిగింది 1949 లో, షాను హత్య చేయటానికి ప్రయత్నం జరిగినప్పుడు, ఆ హత్య చేయటానికి ప్రయత్నించింది ప్రతీప వర్గాలకు చెందిన ఒక ముస్లిం మతోన్మాది అనే విషయం దేశంలో ప్రతి ఒక్కరికీ తెలిసిన విషయమే అయినా, పశ్చిమరాజ్యాలు ఆ అభాండాన్ని యావత్తూ వామపక్షాల నెత్తినవేసి రద్దటానికి లేవదీసిన ప్రచారమంతా చూసి ఆయన విభ్రాంతుడైనారు 'ఇక్కడ దేశంలో జరుగుతున్న వాస్తవిక సంఘటనలను పశ్చిమ రాజ్యాలకు నచ్చ చెప్పటానికి ప్రయత్నించటం గాజుబుడ్డిలో కూర్చుని గోల పెట్టటంలా వుంటుంది మనం నెత్తి నోరూ కొట్టుకుని ఎంత గోల బెట్టినా వాళ్ళకు వినిపించదు' అన్నాడాయన 'తెరిచి ఉన్న సీసామూతి రష్యావేపు తిరిగి వుంది, వినపడితే వాళ్లకే మన్నా వినిపించాలి' అన్నారు

ఇవన్నీ ఆయా పెద్ద మనుష్యుల వ్యక్తిగతాభిప్రాయాలే కావచ్చు, కాని యివన్నీ సాంఘిక చైతన్యంగల నిజాయితీ గల పెద్ద మనుషుల అభిప్రాయాలు కావటంచేత వీటిని మనం సామాన్యజన బాహుళ్యంయొక్క అభిప్రాయాలుగానే స్వీకరించవచ్చు 1946-49 మధ్య చైనాలోని రైతువర్గాలన్నీ తండాలుతండాలుగా కమ్యూనిస్టులలో చేరిపోయారు, దీనికంతకూ కారణం సామాన్య ప్రజానీకానికి మార్గదర్శకులుగా ఉండే మధ్యతరగతి విజ్ఞానవంతులంతా అలాంటి మొగ్గులో ఉండటమేనని మనం గుర్తించవలసివుంటుంది

ఆసియా కమ్యూనిస్టు ఉద్యమాలకు వ్యతిరేకులుగా వుండే అమెరికన్ ప్రముఖులు వాటినన్నిటినీ మోసకృత్యాలుగానూ, దౌర్జన్యంతో కూడుకున్న "కుట్రలు" గానూ చిత్రించటం మామూలైపోయింది నిజానికి ఆరంభదశలలోనూ - తరచు, ఆటు పరిణామదశలలోనూ కూడా వాటిలో కొంత కుట్రతత్వం వుండేమాట నిజమే తమ కార్యక్రమాలు నిర్విఘ్నంగా కొనసాగించుకోవటానికి, అవసరమనితోస్తే, ఎలాంటి అభూతప్రచారాలనైనా లేవదీయటానికి, ఆసియాలోని యే కమ్యూనిస్టూ జెరవని మాట కూడా నిజమే వాళ్లు ఎక్కడ అధికారంలోకి వచ్చినా సాయుధ దౌర్జన్యంతోనే వచ్చారు కాని ఒక విషయంమాత్రం వుంది కమ్యూనిస్టులు ప్రారంభించిన ఈ కుట్రల్లో తక్కిన ప్రజానీకమంతా జేరిపోయినప్పుడే వాళ్లు విజయాలు చేపట్టగలిగారు మరో విధంగా చెప్పాలంటే ఈ కుట్రలు బ్రహ్మాండమైన ప్రజోద్యమాలుగా పరిణమించినప్పుడు వాళ్లు అధికారాన్ని హస్తగతం చేసుకోగలిగారు కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చినప్పుడు వారు పూర్వం రష్యా అవలంబించిన తీవ్రదృక్పథంతోనే ప్రవర్తించితే, పైన ఉదహరించిన బాపతు యే మితవాదికి స్థానం వుండదు ఇదంతా ఆయా పెద్దమనుషులకు తెలియక పోలేదు అయితే వాళ్లంతా చియాంగ్, సింగ్ మన్ రీ, యితర వలసాధికారుల కిరాతాన్నంతా ప్రత్యక్షంగా చూచినవాళ్లు గావటంచేత, వీటిముందు కమ్యూనిస్టులవల్ల కలిగే యాతి

(43-వ పేజీ చూడండి)



సర్వీసెస్ జట్టుతో జరిగిన హాకీ ఫైనల్ ఆటలో పంజాబ్ గోల్ కీపర్ రామ్ప్రకాష్ తనగోలు కాపాడుతున్న దృశ్యం

ఫోటో: ఆంధ్రపత్రిక స్టాఫ్ ఫోటోగ్రాఫర్

## ★ అదీ - ఇదీ ★

### దేనిపై యుద్ధం?

" . పశ్చిమ రాజ్యాల సమిష్టిబలం ఈ రాజ్యాలను దురాక్రమణనుండి రక్షించడానికి సరిగా వినియోగపడుతుంది గాని ఒక సిద్ధాంతాన్నిగాని, సాంఘిక వ్యవస్థను గాని.. (ప్రతిఘటించడానికి) సరిగా వినియోగపడదు ఈ వ్యత్యాసం అర్థంకాకనే రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది ఇందుకే మూడవప్రపంచ యుద్ధంకూడా రావచ్చు

"మనం ఈ తరంలో చూసిన రెండు ప్రపంచయుద్ధాలుకూడా కమ్యూనిజమునుంచి ఉద్భవించలేదనీ, యుద్ధాలనుంచి కమ్యూనిజము ఉద్భవించిందనీ, సమష్టి రక్షణకు గాని సమష్టి బలాలను ఉపయోగించని, కారణాన యుద్ధాలు కలిగాయనీ మనం మరిచినట్లు కనిపిస్తాం మొదటి ప్రపంచయుద్ధంనుండి రష్యన్ కమ్యూనిజం ఉద్భవించింది, రెండవ ప్రపంచ యుద్ధంద్వారా అది తూర్పు యూరపుకూ, చైనాకూ వ్యాపించింది (కమ్యూనిస్టు సిద్ధాంతాలద్వారా జెకోస్లావాకియాలోకి రష్యన్ దురాక్రమణ జరగలేదా అంటే) జెకోస్లావాకియాపై 1938 లో జర్మనీవంటి కమ్యూనిస్టు వ్యతిరేక దేశం దురాక్రమణ చెయ్యకుండా రక్షణ కలిగించలేకపోయినందునే నేడు జెకోస్లావాకియాలో కమ్యూనిజము కింత బలము చేకూరింది మరొక తీవ్ర కమ్యూనిస్టు వ్యతిరేక దేశమైన జపాను నుంచి 1932 లో చైనాను రక్షించడానికి మనము సంసిద్ధులమై ఉండినట్లయితే ఈనాడు చైనాలో సుస్థిర కమ్యూనిస్టేతర ప్రభుత్వం నెలకొని ఉండేటందుకవకాశం ఉండేది

"మన సమష్టిబలాలతో దురాక్రమణను నిరోధించగలిగినచోట మనము దానిని వినియోగించలేదు మనము దానిని వినియోగించిందెక్కడంటే ఆంతరంగిక సంఘర్షణలో జోక్యం కలిగించుకొనడానికి— రష్యన్ అంతర్యుద్ధంలో ఈ ప్రయత్నం ఘోరంగా విఫలం కావడమేగాక, బోల్షెవిజమును రష్యా జాతీయవాదంతో కలిపివేసింది దీనినుంచి మనం నేడు గ్రహించగల నీతి ఉన్నది

" నిరంకుశ ప్రభుత్వాలను కూలదోసి తద్వారా దురాక్రమణ హేతువులను తొలగించడానికి మన శక్తులను వినియోగపరచడం (విషయంలో) మన పూర్వానుభవం ఆహ్లాదకరమైనది కాదు యుద్ధకారణం జర్మనీలోని ప్రష్యన్ వ్యవస్థ అని 1918 లో అనుకొన్నాం దానిని తొలగించడమూ, వీమార్ రిపబ్లిక్ ఏర్పరచడమూ జరిగింది దానినుండి హిట్లరు ఉద్భవించాడు

—మే 13 "న్యూయార్క్ టైమ్స్"లో నార్మన్ ఏంజెల్.

### న్యూజీలాండులో నిరంకుశత్వం

న్యూజీలాండు లేబరుపార్టీ నాయకుడైన వాల్టర్ నాష్ ఈనెల (మే) ఆరంభంలో చేసిన ప్రకటన పూర్తిపాఠం నాకు అందింది అవిచ్ఛిన్నంగా సాగే రేవు సమ్మెలపట్ల(న్యూజీలాండులోని) టోరీ ప్రభుత్వం అవలంబించే చర్యలను (ఈప్రకటన) ఖండిస్తోంది తాను గాని, ఇతర కార్మిక నాయకులుగాని ఎమర్జన్సీ నిబంధనలను గురించి నోరు విప్పరాదని ఆంక్ష ఉన్నట్టు (నాష్) చెబుతున్నాడు ప్రతిపక్షంవారికి రేడియో ఉపయోగించే అవకాశం లేదట లేబరు పక్షానికి చెందిన పార్లమెంటుసభ్యులు బహిరంగసభలలో ప్రసంగించకుండా చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయట పార్లమెంటును సమావేశపరచమని ఎన్నిసార్లు కోరినా ప్రధానమంత్రి హాలండ్ నిరాకరించాడు రేవుకార్మికులు తిరిగి పనిలో ప్రవేశించడానికి ఏర్పాటైన నిబంధనలన్నిటికీ ఒప్పుకొన్న తరువాత కూడా ఉద్రిక్తపరిస్థితి కొనసాగుతూ, హింసాయుత సంఘర్షణ జరుగుతూనే ఉన్నది

" బ్రిటిష్ ఆచార వ్యవహారాలకు వ్యతిరిక్తమైన ప్రభుత్వం ఏర్పడకుండా చూసే మిషతో, నియంతృత్వానికి దారితీసిన ప్రభుత్వాలు అవలంబించిన మార్గాలనే (న్యూజీలాండు) ప్రభుత్వం అక్షరాలా అనుసరిస్తున్నది," అని నాష్ చెబుతున్నాడు

ఇటీవల న్యూజీలాండునుండి వచ్చిన నామిత్రులు చెప్పేవిషయాలను బట్టి, నాష్ ఉన్న విషయాలను తగ్గించి చెబుతున్నాడను కోవాలి రహస్యకరపత్రాలు కొన్ని నాకు చేరాయి వీటిని వెంట ఉంచుకోవడం కూడా ఇప్పుడు నేరమే ఎమర్జన్సీ నిబంధనలు ఎంత తీవ్రంగా ఉన్నాయంటే "హియర్ అండ్ నౌ" అనే మితవాదమాసపత్రిక తాలూకు ఇటీవలి సంచికలో సమ్మెను గురించి ఎట్టి వ్యాఖ్యానమూ వ్రాయలేక ప్రభుత్వపత్రికలలోని తీవ్ర ప్రకటనలను పునర్ముద్రించవలసి వచ్చింది ఆస్ట్రేలియా రేవులకు కూడా వ్యాపించసిద్ధంగా ఉన్న ఈ సంఘర్షణ న్యూజీలాండు ప్రభుత్వానికీ, కమ్యూనిస్టు యూనియనుకూ మధ్య సాగుతున్నట్టు ప్రదర్శించబడుతోంది కాని నేను చదివిన వివరాలను బట్టి చూడగా ప్రభుత్వాన్ని ప్రతిఘటించే హక్కుకే ముప్పు కలిగే పరిస్థితి ఏర్పడుతున్నట్టు తోస్తోంది

—మే 26 న్యూస్టేట్స్ మన్" లో "క్రిటిక్"

### చైనాకు బ్రిటన్ చేసిన ఉపకారాలు!

[మే 19 "న్యూ స్టేట్స్ మన్" లో కొందరు చైనావారు ప్రకటించిన లేఖను గత వారం ఈ శీర్షికలో ప్రచురించి ఉన్నాము అదే సంచికలో ఆలేఖపై వ్యాఖ్యానిస్తూ "క్రిటిక్" రెండు సూచనలు చేశాడు (1) బ్రిటిష్‌వారు చేసే రాజకీయ సూచనల పట్ల చైనావారు మరింత శ్రద్ధ కనపరచాలి (2) ఏ షరతులపై యుద్ధవిరమణకు ఒప్పుకొంటారో చెప్పాలి

ఈ రెండు సూచనలపైనా వ్యాఖ్యానిస్తూ సి ఎల్ షా అనే చైనావాడు (బ్రిటినులో ఉంటున్నాడు) మే 26 "న్యూస్టేట్స్‌మన్" పత్రికలో, చైనాకు బ్రిటను లోగడ చేసి ఉన్న "ఉపకారాలను" ఈ విధంగా వివరించాడు ]

" (1) కేంద్ర ప్రజాప్రభుత్వం చైనాలోని ఏకైక ప్రభుత్వమని గుర్తించి ఉండికూడా తాయివాన్ (ఫార్మోజా) లో బ్రిటిషు ప్రతినిధిని ఉంచారు (2) ఐక్యరాజ్యసమితి వివిధసంఘాలలో చైనా ప్రతినిధుల విషయం వోటింగు జరిగినప్పుడు బ్రిటను చంగ్ కైషేక్ ప్రతినిధుల ఉద్వాసనకు వ్యతిరేకంగా వోటు చెయ్యడమో తటస్థంగాఉండడమో చేసింది (3) గత జనవరిలో 12 ఆసియా అరబ్బురాజ్యాల శాంతి ప్రతిపాదనలకు బ్రిటన్ వ్యతిరేకంగా వోటు చేసింది (4) చైనాపై దురాక్రమణ నేరం మోపుతూ అమెరికా తెచ్చిన ప్రతిపాదనను బ్రిటన్ బలపరిచింద (5) చైనాపై ఆంక్షలు పెట్టాలని అమెరికా ఇప్పుడు చేసినప్రతిపాదనను కూడా బ్రిటన్ బలపరిచింది. ఇంకొక విషయం కూడా ఉదహరించాలి గతమాసంలో మైత్రి రాయబారవర్గ నాయకుడుగా చైనా ప్రతినిధి ఒకడు ఈ దేశానికి (బ్రిటనుకు) రాగోరగా అతనికి 'విజా' నిరాకరించబడింది కాని చంగ్ కైషేక్ ప్రభుత్వ మాజీవిద్యాశాఖామంత్రి ఇటీవల ఫార్మోజానుండి వచ్చాడు ఆయనకు

(45 వ పేజీ చూడండి)




నాకు అత్తవారింటి దగ్గర్నుంచి ఆహ్వానం వచ్చింది ఎండక్కి రమ్మవమని బ్యాంకుకు గూడ ఆ రెండురోజులు సెలవే కొబట్టి వస్తానని అభయమిచ్చి మా బావమరిదిని పంపించా అదేమిటో అత్తవారింటి కనగానే ఎక్కడలేని ఆడంబరం దానంత టదే వద్దన్నా వచ్చిపడుతుంది

ఎన్ని శ్రీరంగనీతులు చేప్పేవాడైనా సరే ఆ రోజువచ్చేసరికి గ్లాసుకోపంచె, సిల్కులాల్చి ఒకవేళ లేకపోతే ఏ స్నేహితుల దగ్గరైనా సరే అరువు తెచ్చుకుని ధరించి ఎప్పుడూ కొననివాడైనా సరే ఒక పత్రిక కొని చంకనపెట్టి బయలుదేరుతాడు అత్తవారింటికి

పండగ ఇంకా రెండురోజులు వుంది! ఎల్లుండి భోగి రేపు సాయంకాలమే ప్రయాణం అత్తవారింటి దగ్గర నా ఆడంబరాన్ని ఎలా ప్రదర్శించాలా అని ఆలోచిస్తూ ఆరోజు సగంరాత్రి నిద్రలేకుండా గడిపా

మరునాడు నా అతుకుల కొలిజోడును మూలకి విసరి అక్షరాలా పంద్రెండు రూపాయల పది అణాలు అర్పించి క్రొత్త చెప్పులజత ఒకటి కొన్నా అటునుంచి వస్తూంటే దాదాగారి కొట్లో సెంటు వాసనలు నన్ను ఆహ్వానించాయి నా మనస్సు పెర పెరలాడింది సరే వెళ్లి మంచిసెంటు ఇవ్వండి అని అడిగాను ఆయన రెండు రూపాయలు చేతిలో వేయించుకొని అంగుళం సీసాలో ఏదో నల్లటిది పోసి అప్యాయంగా చేతిలో పెట్టారు "రెండు రూపాయలకు ఈ అంగుళం సీసానా!"అని నాలో నేను గొణుక్కున్నా ఇంకా ఏమైనా కొనాలా అని ఆలోచించా అఁ ఇంక దేనికిలే ఇంకా కొంటే బడ్జట్ లోప మౌతుంది మా మామగారు రేపు పండక్కి నాకు ఇంతకంటె ఎక్కువ ఇస్తాడా అని అనుకుని సరిపెట్టుకున్నా

ఆ సాయంకాలం బ్యాంకు నుంచి రాగానే గబగబ స్నానం చేసి గ్లాసోపంచె కట్టి సిల్కులాల్చి వేశాను అరువు తెచ్చినదిమాత్రం కొదండోయ్ మా మేనమామ నా పెళ్లికి కుట్టించాడు. అమాతేళ్ల నుంచి బీరువాలో పెట్టి ఏడాదికి ఒకటి రెండుసార్లు ఒంటిమీద పెట్టి తీస్తా చెదలు పట్టకుండా ఇక బట్టలకు సీసాలోని సగం సెంటు రుద్దా గది అంతా ఘుమఘుమలాడిపోయింది తరువాత ఒక జత బట్టలకు గూడ సెంటు పులిమి సంచీలో సర్దాను

6-30 గంటలకు బండి బయలుదేరుతుంది నాకు ఆదుర్దాగా ఉంది ఎప్పుడు అత్తవారిల్లు చేరదామా అని ఎందుకంటె మా శ్రీవారు ఒక నెలరోజులనుంచి అక్కడే ఉంటోంది లెండి చకచకా తలుపులన్నీ వేసి తాళం బిగించి రెండుమూడుసార్లు గట్టిగా లాగి చూచి బయలుదేరాను ఆరు గంటలకల్లా, బండి ఇంకా పెందలకడే బయలుదేరుతుందేమోనని దాని తస్సాదియ్యా బండి సరిగ్గా 6-30 గంటలకే బయలుదేరింది \

అయ్యో నా సామిరంగ నేను అత్తవారింటి యాత్రాసందర్భంలో కొన్న ఆ క్రొత్తచెప్పల జత కొస్తా వేసుకరావడం

(24-వ పేజీ చూడండి)




లా కాలం కిందటి కథ ఇది ఆంధ్రదేశం అంతటా జనం క్రమక్రమంగా వ్యాపించి, కొత్త కొత్త ఊళ్లూ, పల్లెలూ నిర్మించుకుంటున్న రోజులవి కృష్ణానది ముఖద్వారందగ్గర దక్షిణపు ఒడ్డున పెదవర్రు చినవర్రు అనే పల్లెలు కట్టబడినవి వాటికి ఎదురుగా నదిలో ఉన్న ఒక లంకలో ఆఊరిఆవులు మేస్తూఉండేవి ఇట్లాఉండగా కొన్నాళ్ళకు ఆఊళ్ల దగ్గరకు మనుష్యుల్ని తినే పులులు చేరి అల్లకల్లోలం చేసినవి. అవి నదిలంకలో పీఠం వేసుకున్నవి జనం భయపడి ఊళ్లను ఖాళీచేసి వెళ్లే పరిస్థితి ఏర్పడగా, వీరమ్మ అనే బాలింతరాలు సాహసంచేసి ఒకపులిని నరికివేసింది దాంతో జనం ధైర్యం తెచ్చుకొని ఒక్కసారిగా మీదపడి పులులన్నిటినీ హతంచేశారు ఈ సంఘటనకు జ్ఞాపకంగా ఆ ఊళ్ళకు పెదపులివర్రు, చినపులివర్రు అనీ, ఆ లంకకు పులిగడ్డ అనీ పేర్లు వచ్చినవి )

(ఊరిబయట పిట్టల కలకలం గొల్లపిల్లల ఆటల సందర్భంలో వినవచ్చే కేకలు )

మొదటిగొంతు. అరేయ్! ఇంక లెగరండ్రా! పొద్దు మాటార్తుంది మళ్లీ గొడ్లను మళ్లెయ్యాల

రెండవ అప్పుడేనంట్రా? బారెడు పొద్దుంటే!

మూడవ అవున్రా అప్పుడేపోయ్యేం జేస్తాం?

రెండవ సరేగాని కలమయ్యా నువ్వొక్క పాట బాడు ఆ తరవాత లెగుద్దాం

మొదటి అయితే యేం బాడమంటారు?

రెండవ కిష్టలీలలు పాడు

మొదటి అయితే కంసవధ బాడనా?

మూడవ అహాఁ! కేశివధ బాడు

మొదటి సరే (గొంతు సవరించుకుని)

అందమైనా మందలోనా
కిందుమీదూ సూడకుండా
కదకా దొక్కుతు కేశి వచ్చాడోయ్
ఓ నందబాలా,

కదుపులన్నీ కదలబారినవోయ్
కొండలన్నీ పిండిగొట్టే
దండిమగడై నీవ యుండా
గంపరగండయి కేశివచ్చాడోయ్
ఓ కిష్టా, వాడి,

దుండగాలే అలివలవ్వనవోయ్
సింహాలె సివాలె యేసేసినాగు
పందూలు కుక్కల్ని సీల్చినట్లుగా
మందల్ని కదుపుల్ని కుమ్మేసినాడు
సివంగిలాగున సిమ్మేసినాడు
పరవళ్లు తొక్కి
గెంతులు పెట్టి
రంకెలు యేసి
బెబ్బులిలాగున
బొబ్బలు పెడుతూ

(పులి అరిచిన శబ్దం)

మూడవ: అరె! అరె! పులి అరుపులాగుందే!

రెండవ ఆఁ! పులి గాండ్రు గరిలి! యాడనుంచి వొచ్చిద్ది పులి యీడకి? ఆంబోతు అరిసి ఉంటుంది

మూడవ అంతే అయ్యుంటది లే కలమయ్యా, నువ్ కానియ్

మొదటి పరవళ్లు తొక్కి గెంతులు పెట్టి
రంకెలు యేసీ
బెబ్బులిలాగున బొబ్బలు పెడుతూ
శివశివ! అవుల్ని పీక్కేసినాడూ.
కిష్టయ్య నీవూ సూస్తుకూసుంటె.
దిక్కేది మాకూ అనిరి గోపకులు.

(మళ్లీ పులి అరిచిన శబ్దం జనం పరుగెత్తుకుని వచ్చిన కలకలం )

కొత్తగొంతు ఓయ్! యింకా యీడిట్టా సూసుండారేం! పెద్దపులొచ్చింది

1, 2, 3 ఆఁ! పులా ?

కొత్త అవును మడుసుల్ని దినేపులి

1, 2, 3 బాబోయ్! యాడనుంచి వచ్చింది

కొత్త మొదుట్లో కొండీటి కొండల్లో తిరిగేది జనం గుంపులుగా పడి తరిమితే మంగళగిరి కొండల్లోకి వచ్చింది ఆడినుంచి ఒక్కొక్క ఊరుగా తరుముకొస్తున్నాం

(పులి అరుపు )

జనం అదుగదుగో పోతుంది పదండి

కొత్త వొదలగూడదు పొడవండి అదే యెటుబోయిందో ?

మొదటి పిల్లవాడు కిష్టపక్కన రెల్లు దుబ్బుల్లోకి పొయ్యేంటది

జనం ఆ! మీరంతా జాగర్త

* * * *

(స్వల్పకాల విరామం ఒకే మొగగొంతు పాట )

నురుగులు కక్కుతు గట్లను తంతూ
గుబగుబ పొంగెను యేరూ
మా
సేల నింపినది యేరూ
యెండిపోయినా సేలన్నిటిలో
జలజల పారును నీరూ
బల్
గునగున పాడెను నీరూ
నెర్రెలు విచ్చిన పొలాలనిండా
తళతళలాడెను మీలూ
హాయ్
మిలమిలలాడెను మీలూ
యెండకాకకూ నిప్పులుకక్కే
ఇపకతిన్నెలవి యేవీ
పో
మాయమయ్యేనవి పోయీ
గరికపోసలే కరువైపోయిన
గరువులనిండా పూలూ
మా
కడుపులు నింపే సాలూ

(పెద్దగా ఒక యువతి నవ్వు)

మొగ యేంది పిల్లా నవ్వుతుండావ్ ?

ఆడ యేం లేదు మాఁవాఁ! నువ్విప్పుడే గదా సద్దిబువ్వ తిన్నది! మళ్లీ యింతల్లోకే కడుపులు నిండాలని పాడుతుండావే! పుల్లీ బువ్వపెట్టేదా, యేం?

మొగ భలేదానివి పిల్లా. యేందో కుశాలుగా బాగుకుంటుంటే

ఆడ యేం దంత కుశాలు?

మొగ కుశాలుగాకేం? ఈ యేటి పంట ముమ్మురంగా పండిందిగదా, సంబరం పండెంలో నా కోడెలు నెగ్గినయ్ ఇంక నువ్వు నా కొక బుడ్డోణ్ణి అందియ బోతున్నావ్

ఆడ (గునస్తూ) బుడ్డోణ్ణిగాదు- ఆడపిల్లనే అందిస్తాలే

మొగ ఓయబ్బో! అంతా నీ సేతుల్లో ఉన్నట్టే!

ఆడ కాకపోతే! . ఉండు మామా! ఏదో సాటింపు ఇనబడుతుంది

(చాటింపు డప్పుమోత)

చాటింపువాడు ఓహోయ్! సకలమైన జనానికీ తెలియజేసేదేంటంటే మన సీమకు కొండీటి కొండల్నుంచి మడుసుల్ని దినే పులులు కొన్ని ఒచ్చినయ్. అయ్యన్నీ కిష్టలంకల్లోనూ, యేటొడ్డు దుబ్బుల్లోనూ జేరినయ్ ఆటిల్లో ఒకటి ఈ పెదవ్రుకాడా, ఇంకోటి సినవ్రుకాడా యెక్కువగా తిరుగుతుండయ్. కనక యావన్మంది జనం జాగర్తగా ఉండాలొహోయ్

(డప్పుచప్పుడు )

మొగ ఆఁ! రే! పుల్లొచ్చినయ్యా ? అయితే యీటిని తరిమెయ్యాల్సిందే లేకుంటే బతకలేం

ఆడ అయితే నువ్ యాటకి పోతావా మామా ?

మొగ మరి ?

ఆడ కొంచం జాగర్తగా ఉండుమామా.

మొగ నీ కోటయ్‌ని యెరగవ్ పిల్లా

ఆడ యెరక్కేంగాని మామ, కొంచం జాగర్తగానే ఉండు. యీడ నీకోసం యీరమ్మ కనిపెట్టుకుని ఉంటుందని గ్యాపకం పెట్టుకో

కోట అసలు మరిసిపోతేనేగా, గ్యాపకంజేసుకున్నేందుకు సరే, నే యెల్లొస్తా పిల్లా

వీర ఆఁ యిదుగో మామోయ్.

కోట యేంది పిలిశావా ?

వీర యేంలే వొచ్చేటప్పుడు పులిగోళ్లు పట్టుకురా. అబ్బాయ్ మెళ్లో కడదాం

కోట ఏయ్ దొంగా! అమ్మాయిని అంది స్తానంటివే !

(నవ్వులు స్వల్పవిరామం జనం కలకలం)

ఒక గొంతు ఏ మయ్యోవ్ పెద్దమడుసులూ! బయల్దేరండి పులుల్ని కొట్టెయ్యాల లేకుంటే బతకలేం

కోట · అంతా ఉండారో లేదో సూడండి సుబ్బయమామా!

మొదటి అంతా ఉండారుకాని కోటయ్యా, అందరుదగ్గరా బరిసెలూ, గొడళ్లూ ఉండయ్యో లేదో సూడు

మూడో డప్పులజనం, తప్పెట్లవాళ్లు, బాకామడుసులు వచ్చారా ?

కోట · అంతా సిద్దమే బయల్దేరండి అదుగో. మా పొరుగింటి రామయ్ తాత వొస్తున్నాడు ఎందుకో !

తాత అబ్బాయ్‌లూ! కొంచెం జాగర్త మీన ఉండండ్రా

కోట. అది నువ్ జెప్పాలా తాతా

తాత లేదులే పెద్దోణ్ణి కనక జెప్తున్నా అందులోనూ, కోటయ్యా, నువ్వసలే దుందుడుకు మడిసివి

కోట · మరి బుజ్జగింపుమాటలకి పులి ఎళ్లిపోద్దా ? దుడుకుగా ఉండాల్సినసోట అట్టా ఉడాల్సిందే.

తాత సరేలే అయినా నీ పెళ్లాం యీరమ్మ నిండుపొద్దులమడిసి

కోట సరే తాతా! నువ్ జెప్పింది గ్యాపకం ఉంచుకుంటాలే ఊఁ పదండయ్యా

(స్వల్పకాలవిరామం డప్పుల, బాకాల మోత మనుషుల కేకలు)

సుబ్బయ్య అరేయ్! అదుగో పులి ఆ గచ్చపొదపక్కన

(కేకలు, అరుపులు)

కోటయ్య ఏయ్! అటునుంచి కమ్ముకు రండీ

(పులిఅరుపు)

మూడో ఇదుగో ఇదుగో ఇటెవస్తుంది కాసుకోండి

సుబ్బ ఆఁ! ఆఁ!... యెదురు పొదలోకి దూరింది

(జనం ఆర్భాటం అరుపులు, పులి బొబ్బలు)

జనం కొట్టండి పొడవండి

(అతిభయంకరంగా పులి అరుపులు )

మూడో అమ్మో! దానిదగ్గరికి పొయ్యేదెట్టా? ఇంతదూరానే ఒల్లు ఒణికిపోతుంది

కోట ఆఁ! యిట్టా అనుకుంటే అయినట్టే! బయపడేవోళ్లుంటే, నాయెంబడే రాండి

(భయంకరంగా పులి బొబ్బరింత మనిషి అరుపు)

జనం: అయ్యో! కోటయ్య బరిసెపోటు తప్పింది

సుబ్బ అరెరె! కోటయ్యని పట్టేసింది. రండయ్యా! దాన్ని కుమ్మి ఇడిపిద్దాం

మూడ అమ్మో! నాకు గుండెలు నిలవటంలా!

(పరుగు)

సుబ్బ అరేయ్! రండ్రా! పారిపోవద్దు అంతా లగెత్తారె! నే నొక్కణ్ణే ఏంజేస్తాను

(జనం పారిపోతున్న శబ్దం కాల విరామం)

వీర యేం రామయ్ తాతా! పులిమీదికి యెల్లినోళ్లు యింకా రాలేదే?

తాత. నేనూ అదే చూస్తున్నా యీరమ్మా అయినా, పులియా టంటే మాటలా!

వీర యేమో! యేమవుద్దో!

తాత యేం బయపడొద్దు కోటయ్య యిక్కడున్నట్టుగా రాడూ?

వీర నీమాట చల్లగా అబ్బాయ్ పెళ్లోకి పులిగోళ్లు తెస్తాడన్నమాటే

తాత అబ్బాయ్ యెవురు? వోయ్! ఒహ్హోహ్హో! పుట్టబోయే అబ్బాయ్‌కా! అహ్హహ్హా! నీయిల్లు బంగారంగానూ, బలే దానివి యీరమ్మా

వీర కానా పుల్లు ఒచ్చినయ్యంటగా, తాతా?

తాత ఔను అయ్యన్నీ కిష్టలంకలో మటం పెట్టినయ్ ఇంతమటుకూ ఆలగతంగా ఉన్న లంక కాస్తా పులి గడ్డయి పోయింది ఆటన్నిటినీ యేటాడాల్సిందే

వీర అవునుమరి యిదుగో తాతోయ్! యేటకి పోయినవాళ్లు వొస్తున్నట్టుందే!

(జనం వచ్చిన సద్దు)

తాత యేమయ్యా! కాయా, పండా? యేం మాట్టాడరేందయ్యా?

సుబ్బ యేం జెప్పమంటావ్ రామయ్ బాబూ!

తాత యేం అగాయిచ్చం జరగలేదు గదా! కోటయ్యేడీ?

మూడో ఇంకెక్కడి కోటయ్య?

తాత & వీర ఆఁ! ఆఁ! యేంది?

సుబ్బ కోటయ్ నీ పులిపట్టింది.

తాత అయ్యో!

వీర అయ్యొ మామాయ్ (కేక)

తాత అర్రెర్రె! పిల్లకు జెర్రు కమ్మినట్టుంది అల్లింటికి జేర్చండి యేం జరిగిందో యింక జెప్పండయ్యా

సుబ్బ యేముందీ? అంతా పులిని చుట్టేశాం అయితే దాన్ని కుమ్మటానికి అంతా యనకాడారు అప్పుడు కోటయ్యొక్కడే దైర్యంజేసి, బరిసెతో పొడవబోయ్యేతలికి అది

తాత మీరంతా యేంజేశారూ?

సుబ్బ అడుగో ఆడు పారిపొయ్యాడు అంతడితో అందరికీ పిరికిమందు పడి, లగెత్తారు

మూడో: నే గాదయ్యా ముందు లగెత్తింది అంతా కలిసే పారిపొయ్యాం

తాత సరే యెవరో ఒకరు ఇంక పదండి మీ ఇళ్ల కాడ జనం యెట్టా లబలబలాడుతుండారో! పాపం యీరమ్మకి మోపైన దెబ్బ అసలే నెలలునిండిన మడిసి. నీళ్లాడే పొద్దుల్లో ఈ కష్టం గూడా

(కాలవిరామం పసిపిల్లవాడు యేడుస్తున్న శబ్దం)

తాత యీరమ్మా! పిల్లోడు ఇయ్యాలనుంచి కసిమీద ఉన్నట్టుందే!

వీర యేమోలే తాతా! యెవురు జూసను?

తాత అదేందమ్మా పిచ్చితల్లీ! నవ్ లేవూ సంతోషపట్టానికి

(బల్లు నడుస్తున్న శబ్దం)

తాత యేందయ్యోవ్, ఊరంతా బయల్దేరినట్టుంది! యేంటి కద?

సుబ్బ యేముంది? అంతా ఊరొదిలి పోతుండాం

తాత యాడికి?

సుబ్బ యాడికేముంది ముందు బట్టిప్రోలు పోతాం

తాత ఊరొదట్టం దేనికి?

మూడో దేనికేంది తాతా ఆ పులి మన్ని బతకనిచ్చేట్టుందా?

తాత యేంజేసింది?

మూడో యేం చేసేందేంటి? కాలం కాపలాకి యెల్లినోళ్లను పలారం జేస్తున్నది

తాత ఆఁ?

మూడో చీకటిపడ్డ తరవాత ఊరిబయటి కెళ్లటమే గండంగావుంది

మరొక అదేందయ్యా! ఊరిబయటిదాకా పొయ్యావ్? ఊరిసివరి యిండ్లోకి కూడా నిన్నరేత్రి వొచ్చింది దాని గాండ్రింపులకి యెక్కడిజనం అక్కడ గజగజ లాడిపొయ్యారు

సుబ్బ మొన్న ఊరిసివరి సాంబయగారి పింతల్లి రేత్రివేళ బయటకి ఎళ్లిందంట అంతే మళ్లీ మడిసి కనిపిస్తే ఒట్టు మర్నాడెళ్లి చూస్తే దొడ్డిగుమ్మంకాడ నెత్తుటితో తడిసి ఆమె సీరా, కొన్ని తలెంట్రుకలూ కనిపించినయ్

మరొక పురాణంశాస్తుర్లుగారి సుట్టాలబ్బాయంట అల్లింటికి ఒచ్చాడు ఆ అబ్బాయి, శాస్తుర్లుగారి అబ్బాయి, ఇంకా నలుగురు కుర్రోళ్లు కలిసి దొంగలమర్రి కాడికి ఇస్తర్ల ఆకులకోసం పొయ్యారంట ఆకులు కోసిం తరవాత ఇంటికి పోదామని సుట్టాల కుర్రోడు ముందు దిగుతున్నాడంట ఇంతలోకి పక్కనున్న రక్కసపొదల్లోనుంచి పులి చల్లంగా వచ్చి, దిగుతున్న మడిసిని దిగుతున్నట్టుగానే పట్టేసింది

తాత అయ్యయ్యో! పాపం! మేమూ సంగతులు ఇంటూనే ఉండాంకాని, ఈటిని యిసలా ఇవన్నీ నిజమేనంటారా?

మూడు సరే, మీకబద్దం జెప్పట మేనా యేంది, మా పని?

తాత అబదం జపుతారంటలే యేదో బయంమీద యేది జెప్పినా నమ్ముతున్నారేమోనని

మూడో దాని దెబ్బకు నిలవలేక నే పోతున్నాం

తాత అది గాదయ్యా! మళ్లీ జనాన్ని కూడగట్టుకునిపోయి దాన్ని సంపాలిగాని, ఊడిసిపోతారా?

మూడో లేదయ్యా! అది దయ్యపు పులి మొదట దాని నోట్లోబడ్డ మడిసి దయ్యమై, దాన్ని నడిపిస్తున్నాడంట

తాత నమ్మాలయ్యా? ఈ అక్కచ్చిమ్మ కదలు?

మూడో యేంది, అక్కచ్చిమ్మ కదలా అది దయ్యపు పులే కాకపోతే కోటయ్య దెబ్బతప్పిపోద్దా?

తాత అవున్లే అది దయ్యపు పులే కాకపోతే, బీమసేనుడివి నువ్వుపిక్కబలం చూపిస్తావా యేంది?

మూడో సాల్లేవయ్యా నీ పరాసికాలు

తాత ఇదుగో సుబ్బయ్యా! అది ఊళ్లో కొచ్చినప్పుడు మిద్దెమీదినుంచి యిల్లమ్మలతో కొట్టెయ్యకపోయినారా?

సుబ్బ అదేం సిత్రమోగాని, ఎన్నిసార్లు గొట్టాలని జూసినా తప్పించుకుని పోతుంది తాతా

తాత కాత కాకపోతే సరి

మూడో నువ్ కొట్టరాదంటయ్యా మాటలు జెప్పకపోతే,

(27-వ పేజీ చూడండి)




అతన్ని నేను బాగా ఎరుగుదును, మా బళ్లోకి వెళ్లేదారిలో అరుగుమీద కూర్చుని అతను జోళ్లు కుట్టేవాడు అతన్ని నేను బాగా ఎరుగుదును అతను కుట్టిన జోళ్లుమాత్రం ఆ ఊరివారందరికీ బాగా తెలుసు అతని ముఖం ముందు కాకపోయినా చాటుగానన్నా వాటి శ్రేష్ఠతను గురించి నలుగురూ కచేరీ సావిళ్లో కూర్చొని చెప్పుకొనేవారు అప్పుడు జోడు కుట్టడం తడవు ఎవరిమటుక్కు వారే పోటీలుపడి పట్టుకుపోయేవారు

అతన్ని మొదటిసారిచూసింది నా ఆరో ఏట అప్పటి జోళ్ల మన్నికనీ, వాటి చౌకతనాన్నీ ప్రశంసించేవారయితే చాలా మంది ఉన్నారుగాని అప్పట జీవిత రహస్యాన్నీ, అతని జీవిత తత్వాన్నీ తెలిసిన వాళ్లు ఇంకెవళ్లూ లేరు ఆ గౌరవం, ఆ ప్రతిష్ఠ నాకే దక్కాయి కోహినూర్ వజ్రంకంటె అమూల్యమైన అతని అనుభవాల్ని అంత చిన్నవయస్సులోనే చిక్కబట్టుకొని జాగ్రత్తగా దాచుకొంటూ వచ్చాను

మా నాన్నని నేను ఎరగను మా అమ్మ కూడా నాకు సరిగ్గా జ్ఞాపకంలేదు మా అమ్మని సవారీమీద దేవుడిగుడికి తీసికెళ్లిన దృశ్యంమాత్రం నాకు జ్ఞాపకం ఉంది మళ్ళీ మా అమ్మ రాలేదేమని మా తాతయ్యని అడిగినప్పుడల్లా దగ్గిరికి తీసుకొని కళ్లనీళ్లు పెట్టుకొనేవాడు కడుపుమీద పడుకోబెట్టుకొని కల్లబొల్లికబుర్లతో మరపించాలని ప్రయత్నించేవాడు మా తాతయ్యే మొద్దుల్గో నాకు ఎంతో ఇష్టమైన స్నేహితుడు 'మొద్దుల్గో' అని ఎందుకన్నానంటె రానురాను మా తాతయ్య కొంత పాడయిపోయ్యాడు ఇరవై ఇరవైలదాకా ఎక్కాలు తలకిందలా అప్పజెప్పమనటం బొత్తిగా మొండితనం కాకపోతే ఏమిటి?

మా తాతయ్య బాధపడలేక నేను బాధపడుతన్న రోజుల్లో అప్పడి పరిచయం ఏర్పడింది అప్పణ్ణి పరిచయం చేసింది కూడా మా తాతయ్యే అప్పటికి అప్పడి వయస్సు నలభైఐదు సంవత్సరాలు భు-కేమీ లోపం లేకపోయినా శాంతికిమాత్రం అతని జీవితం మొహం వాచింది అతని ముఖంలోని ముడతలు, నెరిసిపోయిన జుట్టే అందుకు సాక్ష్యం తన పొడుగైన జుట్టుని వెనక్కి దువ్వి చివర ముడి వేసేవాడు నుదుటిమీది కురుల్ని ముందుకు దువ్వుకొనేవాడు ముఖంనిండా నూనె జిడ్డు ఓడుతూ ఉండేది తొడలమీద చిరిగిన పంచెతో ఒక్క మోకాలు ముందుకు వంచి చరచరా పనిచేసుకుపోయేవాడు నవ్వితే అతని పెదవి సెలవుల్లో విషాదం చివురించేది మనిషి సన్నని పొడుగైన కారునల్లని విగ్రహం నవ్వితే అతని హృదయం కరిగి కళ్లల్లోకి కనిపించేది

నిజానికి నాకు మాపల్లెలో అంతమంచి అప్పడనే వాడున్నాడని కూడా తెలియదు మాతాతయ్యతో నేను చాలాసార్లు చేలోకి వెళ్లేవాణ్ణి నాకోసం ఆయన సెనగ మొక్కలు పీకి కాయలు తంపటపెట్టే

వాడు ఆ సెనగకాయలు వల్చుకు తిని చీకటిపడేవేళకి ఇంటికి వచ్చేవాళ్లం మా తాతయ్య కిర్రుచెప్పులు తొడుక్కొని, నెత్తిమీద గడ్డిమోపు పెట్టుకొని, మెడమీద అడ్డంగా కర్ర ఆనించి, దొరలా ముందు నడుస్తూఉంటే ఆయన వెనకాలే నడవలేక పరిగెడుతూ ఆయన చెపుతూన్న 'శుక్లాంబరధరంవిష్ణుం' మొదలైన శ్లోకాలు వల్లె వేసేవాణ్ణి నాకు ఆ శ్లోకాలు సరిగ్గావచ్చేవి కావు అసలు ఆశ్లోకాలమీద నాకు ధ్యాసే ఉండేదికాదు మా తాతయ్య చెప్పులే నాకెంతో అసూయగా ఉండేవి సరిగ్గా అలాంటి చెప్పులే తొడుక్కొని రాజవీధి ఉట్టి పడుతూంటే, కిర్రుకిర్రు మనిపించుకుంటూ, వాటిపై జూలు నృత్యం చేస్తూంటే పరవశం పొందుతూ నడవాలని మనసుగా ఉండేది ఆ జోళ్లమీదనగిషీ నాకెంతో ముద్దొచ్చేది అలాంటి జోళ్లకి నేనే అధిపతినైతే రాజకుమారులు నాముందు బలాదూరేకదా! నాకలాంటి జోళ్లుకావాలని ఎంత మారాముచేసినా పట్టి కర్రవెధవ కింద కట్టేసి మా తాతయ్య నిర్లక్ష్యం చేసేవాడు నేను ఉండబట్టలేక మా తాతయ్య జోళ్లే తొడుక్కొని తూగిపడుతూ షికార్లు కొట్టేవాణ్ణి మా తాతయ్య ఎంత వారించినా ఊరుకొనేవాణ్ణి కాదు చివరికి విసిగి మా తాతయ్య నావీపు శుద్ధి చేసేవాడు మా'అమ్మ'ని తలుచుకొని రాగాలు పెట్టేసరికి మా తాతయ్య బాధపడి, నన్నుతొలిసారి అప్పడిదగ్గిరకి తీసుకెళ్లాడు

"తల్లిలేని వెధవ అని గారాం చేస్తూంటే నాప్రాణాలు కొరుక్కుతింటున్నాడ్రా అప్పడూ ఏదో జత కుట్టిద్దూ" అప్పడు నాకేసి చూసి నవ్వుకున్నాడు కొలతలు తీసుకొని, "అలాగే లెండి", అన్నాడు

అదే మా మొదటి పరిచయం అప్పటినించీ రోజూ బళ్లోకెళ్లేటప్పుడూ, వచ్చేటప్పుడూ అప్పడి దర్శనం చేసుకొనేవాణ్ణి ఏక్షణం అమాంతంగా ఆజోళ్లు తయారై నా కాళ్లని అలంకరిస్తాయో! బళ్లో బట్టలు వేసుకొని, పలకా, బలపమూ, సరస్వతీవాచకమూ తాటాకు సంచిలో పెట్టుకొని బళ్లోకి పోతూపోతూ అప్పడి కిర్రుజోళ్లకోసం తొంగిచూసేవాణ్ణి బళ్లోకూర్చున్నప్పుడు కూడా ఒంటివేలుకనీ, రెండువేళ్ళకనీ, బొటనవేలుకనీ వంకపెట్టి తిన్నగా అప్పడి దగ్గిరకు పోయి కూర్చొనేవాణ్ణి మా ఇద్దరి పరిచయం ఆ విధంగా పెంపొందసాగేది. నేనువచ్చి కూచుంటేనేగాని అప్పడు నా జోళ్ళు కుట్టేవాడు కాదు నాతో ఊసులాడుతూ మురిసిపోయేవాడు

నేనూ అప్పడూ ఊసులాడుకొంటూంటే మా ఊళ్ళోని పెద్దకాపులూ, కరణాలూ - ఎందరో వస్తూఉండేవారు 'అప్పడూ, జోళ్లు' 'అప్పడూ, జోళ్లు'

'అప్పడూ, జోళ్లు' - అందరిదీ ఒకటే పాట 'ఇదిగో, అదిగో' అని ఏదో సర్ది చెపుతూనే ఉండేవాడు అప్పడు 'అబ్బాయిగారి జోళ్లు కుడుతున్నాను; కాగానే' అదో వంక.

"ఎవరేట్రా?"

"వెంకట్రామయ్యగారి మనవడండి."

"కూతురు కొడుకా? కొడుకు కొడుక్కా?"

"ఆ రమ్మాయిగోరు పొయ్యారు కదండీ ఆరి కొడుకు"

"ఓహో!" అందరూ నాకేసి వింతగా చూసేవారు ఆమాట చెప్పిన అప్పడికి ఏదో జ్ఞాపకం వచ్చేది కళ్లల్లో విచారం అలుముకొనేది, మాట బరువెక్కేది

"అమ్మోరు ఆణ్ని ఎత్తుకుపోయింది గాని నన్నెత్తుకుపోయిందిగాదు ఆ ఎదవే ఉంటేనా"

"ఎవరి ఖర్మ కెవరు కర్తలురా!"

ఆ కాపులూ, కరణాలూ అప్పడి భారాన్ని విదిలించుకొని "ఒరేయ్ తొందరగా కుట్టేయ్!" అని హెచ్చరించి వెళ్ళిపోయేవారు ఎవరూ అతని దుఃఖాన్ని పట్టించుకొనేవారు కాదు నిజమే, ఎవరి ఖర్మ కెవరు కర్తలు?

ఎవరి ఖర్మ కెవరు కర్తలయినా కాకపోయినా ఎవరి ఖర్మని వాళ్లు అనుభవించక తప్పదు. కాని సృష్టిలోని రహస్యమేమిటంటే ఒకరి ఖర్మను ఇంకొకరుకూడా పంచుకుంటేనేగాని ఆ అనుభవించేవాడికి ఓదార్పు ఉండదు అందుకోసం తన దుఃఖంలో పాల్గొనేవాడికోసం చూస్తాడు ఓదార్పు లభ్యం కాకపోదు కాని అది ఎదటివాడి గుండెల్లోంచి రాదు అలాంటప్పుడు అది బాధపడేవాడి ఆవేదనని గెట్టిస్తుంది, దుఃఖాన్ని ఇనుమడింపజేస్తుంది అయినా అప్పడికి ఇంత నూక్కుపోటానికి కళ్లంలోని గింజ లిస్తూనే ఉంటారు ఓదార్పు ఎక్కణ్ణించి ఇస్తారు? కాలమే దుఃఖభాగుల్ని ఓదార్చాలి ఎవరి దుఃఖాలు వారికే ఉన్నాయి.

ఏ దుఃఖమూ వంటబట్టనివాణ్ని నేనొక్కణ్నే అప్పడికి దొరికాను.

"ఏరా, అప్పడూ, అమ్మోరు నీకొడుకును ఎత్తుకుపోయిందా?" అని ప్రశ్నిస్తే చాలు, 'అయ్యనా బాబే' అనిప్రారంభించి తన కొడుకు ఎప్పుడు ఎందుకు ఎలా చచ్చిపోయాడో అదంతా పూసగుచ్చినట్టు చెప్పేవాడు. నేను నోరు ఆవలించుకొని, మోకాళ్లమీద చేతులు ముడుచుకొని, తల ఆనించి శ్రద్ధగా వినేవాణ్ణి.

"పాపం, అచాల్లుగారు మందో మాటో ఇచ్చేవారండి ఏమిస్తేనేంగాక, యెదవ ఆయుస్సుమూడి చచ్చాడు"

అప్పడి కొడుకు ఎలా చచ్చిపోయాడో ఆ చిత్రాన్నంతా ఊహించుకొని, నన్నే అప్పడి కొడుకుగా చిత్రించుకొని, అప్పణ్ణి మా తాతయ్యగా భావించుకొని, ఆ దృశ్యాన్ని భరించలేక ఏడ్చేవాణ్ణి అది చూసి

"చేతికందిన కొడుకు చచ్చిపోయ్యాడు, బాబూ! ఎవరితో చెప్పుకోను, దేశమే చెవిటిది, బాబూ, దేవుడు నా గుండె చెరువు చేసి పుట్టించాడు"

"నీ పెళ్లామో!"

"అదా బాబా!" నవ్వేవాడు. "అది తెంపులు చేసుకొని లేచిపోయింది బాబూ, నాతో బతకలేదంట!"

అతనితో ప్రతీదీ ఒక సమస్యే నాకు. నాకు అర్థంకాని, నేను ఊహించలేని ఎన్నో విషయాల్ని అతను తెలియజెప్పేవాడు నాకు సంశయం కలిగేది చిన్నపిల్లాణ్ణి అంతమంచి వాడితో, నేనే అంత కలసి మెలసి కాలక్షేపం చేయగలుగుతూంటే 'అదెంచేత' బతకలేక పోయిందో నాకు అర్థమయ్యేదికాదు తెగతెంపులు చేసుకు లేచి పోవటమంటే "ఏమిటో? ఒకసారి మా ఆవు కన్నె తాడు తెంపుకొని వెళ్లిపోయిందని విన్నాను మళ్లీ మాఆవును తెచ్చి కట్టుకున్నాం అతను కూడా అలా ఎందుకు చెయ్యకూడదు?

"అంటే?"

"ఏంలేదు బాబూ, నన్నొదిలేసింది"

"నీకు నీతల్లి ఉందా?"

"లేదు బాబూ!" నవ్వేవాడు

పాపం, తల్లిలేనివాణ్ణి అలా వొదిలేస్తే ఏమైపోతాడు? తల్లిలేని నన్ను మా తాతయ్య వదిలేస్తే నేనేమైపోవ్వాలి? అడుక్కుతినాలి ఎలాగమరి! పెద్దవాడుగా అప్పడు! పెద్దవాళ్లని అందరూ వదిలేస్తారు గావును! నేను కూడా పెద్దయ్యాక మా తాతయ్య నన్ను వదిలేస్తాడు ఎక్కాలబాధ వదిలిపోతుంది కాని, నాభార్యకూడా లేచిపోతుందా?

"ఎందుకు వదిలేసింది? అందంగా లేదనా?"

"అందమేటి, బాబూ; కంటికోఅందం, నోటికో రుచీనీ ఈ జోడు చూడు ఇంత అందమైందిగదా, ఎందుకు తొడుక్కోవూ అంటావ్ ఆ జోడు ఎక్కడ కరుస్తదో తొడిగేవాడికి తెలియాలిగాని నీకు తెలుస్తదా?"

నిజమే మరి; జోడు కరుస్తుంది కాబోలు నా జోడుకూడా కరుస్తుందా?

"జోడు ఎందుకు కరుస్తుంది, అప్పడూ?

"ఏడెక్కితే కరుస్తది"

అవన్నీ నాకర్థంకాని సమస్యలు మా బళ్లో 'ఆవు పాలు ఇచ్చును,' అని చెప్తారు గొడ్డుఆవు పాలిస్తుందా? అది ఎందుకివ్వదో చెప్పరు అలాగే ఈ సమస్యలకి కూడా.

మొత్తానికి నాకు జోళ్లు తయారైపోయాయి మా తాతయ్య పావలా ఇస్తే వద్దన్నాడు "అబ్బాయిగారి జోళ్లకికూడా డబ్బియ్యాలా, దొరగారూ? ఆరే రేపు పెద్దాగై కానిసేబిల్ గిరీ చేసి నా రుణం తీర్చుకుంటారులెండి"

మా తాతయ్య నవ్వి ఊరుకున్నాడు ఆ జోళ్లకి ఆయన డబ్బివ్వ లేకపోయాడు ఆ రుణం మాత్రం నా భుజాలమీద ఎప్పటికీ మిగిలి పోయే ఉంది ఆ రుణం తీర్చుకోవటానికని అప్పటి స్నేహం వదిలిపెట్టలేదు నేను మా తాతయ్య అంగోస్త్రాన్ని కుచ్చుల తలపాగాగా చుట్టుకొని, తాటాకుసంచీ చంక కింద పెట్టుకొని, కిర్రుజోళ్లు తొడుక్కుని యువరాజులా నడుస్తూ గోజూ మధ్యాహ్నం పన్నెండుగంటలకే బడికి బయలుదేరి అప్పడి దగ్గర కూర్చునేవాణ్ణి

ఆ సంగతి మా తాతయ్యకి తెలిసి నన్ను [illegible]గా కూకలేసేవాడు అయినా చాటునా [illegible]నా అప్పడిదగ్గరకే పరిగెత్తేవాణ్ణి

"వాడు మాదిగాడురా దగ్గర కెడితే స్నానం చెయ్యాలి నీకు ఒడుగుఅయింది కదా పితృదేవతలకు గతులు తప్పుతాయి," అనేవాడు తాతయ్య

"దూరంగా కూర్చోండి, అబ్బాయిగారూ, తాతయ్యగారు కోప్పడతారు తప్పు" అనేవాడు అప్పడు

అప్పడు కుట్టిఇచ్చిన జోళ్లు తొడుక్కుంటే గతులు తప్పని పితృదేవతలు, అప్పడికి దగ్గరగా కూర్చుంటే ఎందుకు తప్పుతాయో నాకు తెలియలేదు

నాకు తెలియని చాలా సంగతుల్లో, అప్పడికి డబ్బు ఎలా వస్తోందో, ఆ వచ్చిన డబ్బు సరిపోతోందో లేదో -కూడా ఒకటి

"నీకు డబ్బుందా, అప్పడూ?"

"బలేవాడివోయ్, కుర్రయ్యా!" పకపకా నవ్వేవాడు అప్పడు "మీరంతా చల్లగాఉంటే నాకేం లోటు, బాబూ!" వెంటనే అతని ముఖం గంభీరమయ్యేది "ఈ జోడు చూడు, బాబూ తొడిగితే చాలదనుకో నిన్ను కరుస్తది ఎక్కువైందనుకో - తుళ్ళితుళ్ళిపడతావు అలాగే డబ్బుకూడా ఒక్క పొట్టకి ఏమాత్రం కావాలి, బాబూ!"

చిత్ర మేమిటంటే నేను ఒకటోక్లాసు సరస్వతీవాచకంలో నేటికి ఇరవై సంవత్సరాల క్రిందట ఏం చదువుకున్నానో నాకు జ్ఞాపకం లేదు కాని ఇరవై సంవత్సరాల కిందట అప్పడు ఏ రోజున నాకు ఏ పాఠం చెప్పాడో ఒక్క పొల్లుకూడా పోకుండ నేటికీ నాకు జ్ఞాపకం ఉంది బడిపంతులు కొట్టి, తిట్టి, 'అల - తల' అనమనేవాడు. అప్పడు, బాబూ, బాబూ, అంటూనే జీవితాన్ని చదివి చెప్పేవాడు బడిపంతులు పెద్ద చదువులు చదువుకున్నాడు అప్పడు ఏమీ చదువుకోలేదు

ఏమీ చదువుకోని అప్పడిదగ్గర చేరి నేను పాడైపోతున్నానని మా తాతయ్య ఎక్కువ బాధపడ్డాడు నా భవిష్యత్తూ, బాగూ కోరి ఒకసారిమాత్రం తట్టు తేలేలా కొట్టాడు అప్పట్నుంచీ నేను అప్పడి దగ్గరికి వెళ్లటం మానేశాన బళ్లోకి పోతూ కిర్రుచెప్పులుకూడా తొడగటం మానేశాను. ఎందుకంటే, ఎందుకంటే, ఆ జోళ్లు తొడుక్కుని నేను అప్పడు కూరున్న అరుగు ముందునుంచి పోతూంటే, ఆ జోళ్లే నన్ను అప్పడిముందు నిలబెట్టేవి అందుకనే ఆ జోళ్లంటే భయపడేవాణ్ణి ముఖం ఎదటి గోడవైపు తిప్పేసుకొని సుర్రుపుదొడు తీస్తూ అప్పడి ముందునుంచి పరిగెట్టేవాణ్ని ఆ పక్క మలుపు తిరిగి, గోడకి బల్లిలా అంటుకుని వెనక్కి తిరిగిచూసేవాణ్ని నేను వచ్చినదిక్కుకే చూస్తూ నిశ్చేతనంగా నిలబడి పొయ్యేవాడు అప్పడు

ఒకరోజున బడినుంచి వస్తోంటే, దారికడ్డంగా నించొని "అబ్బాయిగారూ, తాతగారు కోప్పడ్డారా?" అన్నాడు. ఆ ఓదార్పు నన్ను చాలా అవమానించింది పట్టలేక వెక్కివెక్కి ఏడ్చాను "ఎర్రినాయనా, ఎయ్యేళ్లు బతుకు నా తండ్రీ!" అని అప్పడు నన్ను దీవించి కళ్లనీళ్లతో వెళ్లిపోయాడు

ఇంకొకసారి కొత్తజోళ్లు కుట్టి, "ఇవి తొడుక్కో, బాబూ! పాతవి పోయినట్లున్నాయి!" అన్నాడు నేను వినిపించుకోకుండా, తప్పించుకు పారిపోయివచ్చేశాను. ఆ రాత్రికే నాకు విపరీతంగా జ్వరం వచ్చేసింది. ఆ తరవాత కొద్దిరోజులకే నేను బస్తీకి వెళ్లిపోయాను.

మేనమామగారింట్లో నేను చదువుకున్న పదిహేను సంవత్సరాల్లోనూ నేను తిరిగి మా తాతయ్యగారి ఊరు వెళ్లవలసిన అవసరం లేకపోయింది. నేను బస్తీకి వచ్చిన చాలా కొద్దికాలానికే మా తాతయ్య స్వర్గస్థుడయ్యాడు మా తాతయ్య బాపతు రెండెకరాల పొలం మా మామయ్యకొచ్చింది నా బాపతు రెండెకరాలు మా మామయ్యే అమ్మి నా చదువుకు ఖర్చు పెట్టాడు.

చదువుసంధ్యలు పూర్తై మళ్లీ ఇరవై సంవత్సరాలకు మా తాతయ్యగారి ఊరు వెళ్లాను ఆ ఊరుఊరంతా మారిపోయింది నా చిన్ననాటి వీథులుగాని, ఆ ఇళ్లుగాని, నా చిన్నప్పటిలా కచేరీ సావిట్లో కలుసుకోవటంగాని-ఏమీలేదు ఒక రైలుస్టేషన్, బస్సుస్టాండు, కాఫీహోటళ్లు, మేడలు అన్నీ అంతా కొత్తే

బస్సుదిగి మా స్కూలుపక్క అరుగు మీదకి చూశాను. అక్కడ ఒక రెండంతస్తుల మేడ కనిపించింది. దానికింద గదిలో తువరశాల. ఆ ఊరి పని పూర్తి చేసుకొని వెళ్లిపోతూ, ఉండబట్టలేక, అప్పణ్ణిగురించి తెలుసుకోవాలని చాలా ప్రయత్నించాను బస్సుస్టాండు పక్క మేడలో 'వసంతకాలపు నూతన అలంకారాలు బాటా జోళ్లు' అన్న ప్రకటన అప్పుడికీ వసంతకాలానికీ ఏమి సారూప్యాన్ని ఊహించుకోగలను?

నేను వెళ్లవలసిన కారు రాలేదు ఒక గంట ఆగవలసివచ్చింది. కారు స్టాండు కెదురుగా కాఫీహోటల్లో ఫలహారంచేసి ఆపక్క కిళ్లీకొట్లో మిఠాయికిళ్లీ కట్టించుకొంటూ నిలుచున్నాను ఆపక్క మురికి కాల్వగట్టున తాటాకుగొడుగుల క్రింద కూర్చుని ఇద్దరు ముగ్గురు మాదిగవాళ్లు "జోడుకు పాలిష్ చేయమంటారా?" అని అడిగారు

ఏమీ ఊబుసుపోక అందులో ముసలాడికి నాజోడుఇచ్చి పాలిష్ చేయమన్నాను. వాడు జోడు చేత్తో పుచ్చుకొని ఇటూ అటూ తిప్పి, ముఖం చిట్లించి

"ఇదేం జోడు బాబూ, యిదవచర్మం! కాలం మండిపోతోంది," అన్నాడు పదిహేనురూపాయలుపోసి నేను కొన్నజోడు ఇలా అవమానింపబడటం నాకే అవమానమయింది. దాని ఖరీదు సంగతీ, దాని ప్రశస్తి సంగతీ అంతా చెప్పాను

"అంతా కుంపినీవోడి మాయండి ఈ రోజుల్లో మాఅయితే రెండు రూపాయలయ్యేను మా రోజుల్లో కిర్రుజోడు కుట్టి పావలా కిచ్చేవాళ్లం. పాతికేళ్లు మన్నేది అంతా కలికాలం వచ్చేసింది, బాబూ!"

"ఏమోయి, అప్పడని ఉండేవాడు, నా చిన్నతనంలో జోళ్లు కుట్టేవాడు వాడేమయ్యాడో తెలుసా?"

"ఆడాండీ—ఎక్కడో చచ్చాడులెండి, ఏం జన్మలే! దేనికి లోపం వచ్చినా ఆ రోజుల్లో భుక్తికి లోపం ఉండేదికాదండి ఇప్పటోళ్లకి నాజూక్కేగాని నాణ్యం అక్కర్లేదండి నాయానికి రోజులుకావండి ఆ కుర్రాళ్లే ఏరు, ఆ వరసే ఏరు ఎంకట్రామయ్యగారి మనవడుండేవాడు అట్టాంటి కుర్రాళ్లే లేరు"

నేను కొయ్యబారిపోయ్యాను. నేనే ఆ మనవణ్ణని చెప్పుకోటానికే సిగ్గేసింది. వాడికి రూపాయ చేతులో పడేసి వాడు చిల్లర పట్టుకు పరుగెత్తుకొస్తుంటే వినిపించుకోకుండా బండిలో పడి, 'స్టేషన్‌కి పోనియ్ వోయ్' అన్నాను

అప్పడు రాయిలా నిలబడిపోయ్యాడు.



---

"నేను చిన్నతనంలో రోజూ విధిగా స్కూలుకి వెళ్లేవాడిని. అయితే అందువల్ల నా చదువేమీ చెడిపోకుండామాత్రం జాగ్రత్త పడేవాడిని."

—మార్కు ట్వేన్.

* * * *

"డార్లింగ్! మనపెళ్లిని కొంతకాలందాకా వాయిదా వేద్దాం," అన్న దొక హాలీవుడ్ సినిమాతార ప్రియుడితో.

"ఏం, నేనంటే నీకు ప్రేమ లేదా?" అన్నాడు ప్రియుడు.

"అదికాదు. నేను నిన్ననే ఇంకొకర్ని పెళ్లాడాను."




1 వ దృశ్యము [పంటపొలం ఉదయం 10 గం॥ ముసలికూల వెంకన్న (60 సం॥లు) వాని కూతురు లచ్చి (16 సం॥ లు) పనిలో వుంటారు ]

వెంకన్న లచ్చా! ఋ ప్పె మంటలు పోస్తున్నాయి గంటె నీకు పిచ్చితల్లా!! నా సెప్తే ఇనుకుండిలేద్దందా పసి కుర్ర నీ యేం చెయగల్లావు తల్లా - ఈ అగ్గిలో!

లచ్చి (చెమట తుడుచుకొని) కాదే అయ్యా!- ఎంత కాలం అని కూకుండేది నీకు మాత్రం బలం వుందా కసుంగా నాకే అలవా టగిద్ది నీకు కొంతబాదితగ్గుద్ది

వెం అయ్యో పిచ్చితల్లా! నాను నీ కట్టం తింటానా కూకుని? సాయమ్మ వుండే పచ్చంలో నిన్ను కూలీ కదల్నిచ్చే దంటావా నాకడుపు!!! (రెండు కన్నీటి బిందువులు పడి నీటిలో కలిసిపోతాయి)

ల (దుఃఖాన్ని కప్పిపుచ్చుకొని) ఏందయ్యా! ఎప్పుడూ అమ్మా సెత్తి అలా యేడుస్తే ఎలా సెప్పు ఏందేల్తాం! నా నుండా గా?

వెం మీ అమ్మ వుండే పచ్చంలో— ఆ ఎంకటేసుగాణ్ణి ఒప్పిచ్చి నిన్నొక కోడల్ని సేసేది ఆడేమో నామాట ఇనుకుండ్లా

ల ఆ వూసెందుకు లేయె అదారో పోతుందారషటు

(కాంత రావు (25 సం॥ లు) రూపవంతుడు, విద్యావంతుడు, అ వరుచుల కలవాడు - (ప్రవేశము)

వెం ఆ! మన కాంతంబాబు గారే! మన పాలందొరే

కాం (లచ్చిని చూస్తూ) ఎంకాయ్!- ఈ పిల్లఎవ్వరా?

వెం మా కుర్రదే దొరా!

కాం (కొంచెం ఆశ్చర్యంతో) అరె!! మీ అమ్మాయా? ఎప్పుడూ కనిపించలేదేరా!

వెం లేకేం దొరా! అయితే కూలి నాల్కి రావటం కొత్తలెగండి

కాం ఆ-హా— పేరేమిరా?

వెం లచ్చి—బాబూ

కాం (ఆలోచించినట్లు కొంచెం ఆగి) చూడు ఎంకాయ్! లచ్చిని మన యింటికి పనికి పంపగూడదురా ఈ ఎండల్లో మాడి బండపని చేయించేదాని కన్నా హాయిగా యింటిపని చస్తుంది

వెం (కొంచెం జంకుతూ) ఎందుకు లెగండి బాబు! అది ఇళ్ళల్లో పని చెయ్య నొల్లనంటంది నా సెప్పినాను బాబూ కూలి సేసుకు బతుకుతానంది బాబు

కాం మీ మురాం గాదూ (లచ్చి వంక ఏదో ఆశగా చూస్తూ) లచ్చీ!— అదేం? మనింట్లో చక్కగా పనిచేసోకూడదమ్మా!

ల (కొంచెం సిగ్గుతో) ఎందుకు లెగండయ్యా! మ అయ్యకూడా ఉంటాడు ఎక్కడున్నా కూలి చేసుకుంటే పొద్దు సిమంతుల యిళ్ళల్లో పనిసెయ్య బుద్ధిగాదు

కాం (నవ్వుతూ) ఆ! నీ ముహాం

(20-వ పేజీ చూడండి)




అలకపాన్పుమింంచి ధర్మారాయుడు లేవకుండే సరికి 'ఆలా కూర్చుంటే ముందు కార్యక్రమం చాగా ఉంది ఏం కావాలో కోరుకో లే'-అని వత్తిడి చేశాడు మామ

ధర్మారాయుడు యేదో యోచిస్తూ మామ వైపు చూసి అన్నాడు 'కోరినది తప్పక యిస్తానంటేనే కోరుకొంటాగాని—లేకపోతే నేకోరుకోనేదీ లేదు, మీరు యిచ్చేదీ లేదు'-అని

'ఆలా గెందుకవుతుందోయ్? కోరుకో తప్పకుండా నువ్వు కోరుకొన్నది కొని యిస్తా,' నన్నాడాయన ధర్మారాయుడికి కొంచెం ధైర్యం చేకూరింది 'తప్పక యిస్తారు గదూ?' అన్నాడు ధర్మారాయుడు

'ఓ' అన్నాడాయన ధర్మారాయుని వైపు దృష్టి నిలుపుతూ చుట్టుప్రక్కల వాళ్ళంతా యీవిధంగా మామగారిని బలవంతపెట్టించి యే మోటారుసైకిలో-మరి యే రేడియోనో కోరుకొంటాడను కొన్నారు

ధర్మారాయుడయితే పెద్ద వాగ్దానం మామవద్దనుండి పుచ్చుకొని తన కోర్కె వెల్లడించటానికి యిష్టపడ్డాడు మామ గూడా అల్లుడేం కోరినా యివ్వటానికి సిద్ధపడ్డాడు! అయితే మధ్యవాళ్లు మాత్రం యేంకోరుకొంటాడో - మామగారి జులు మేవిధంగా వదలిస్తాడో అని ఊహిస్తూ మాత్రం ఉండిపోయారు 'కోరుకో మంటారా?'— ధర్మారయుడు తిరిగి ప్రశ్నించాడు

అతని చాదస్తం— మామకు—చివరకు తనవాళ్లకు సహితం- విసుగును తెప్పించింది 'కోరుకోవోయ్ సందేహిస్తా వెందుకూ? నీకేం కావాలో అది తప్పక యిస్తా' అన్నాడు మామ

'అలా విసిగించకూడదు - కోరుకో రేడియో'- అన్నారు తన సన్నిహితుల్లో ఒకరు!

ధర్మారాయుడు నిజంగా రేడియో కోరుకొన్నా ధర్మారాయుడి మామ యివ్వగలిగినవాడే ఆయన పెట్లో డబ్బు బాగా మూల్గుతోంది అల్లుడేం కోరినా తప్పక యివ్వగల్గుతాడు

ధర్మారాయుడికి యెవరి యోచనలూ నచ్చలేదు—తనకుతానే దూరం యోచించి 'గ్రామఫోను కావాలి'—అన్నాడు

ఓస్ ఈ మాత్రందానికేనా అలాగే లేవోయ్'- అన్నాడు ధర్మారాయుడి మామ- ముందుసన్నాహం చేస్తూ'

'ఓస్ ఈమాత్రమే కోరావేమిట్రా- మీ మామపెట్లో డబ్బంతా బయట గుమ్మరింపచేస్తావేమో అనుకొన్నాము వెధవది- రెండు వందల రూపాయలకక్కుర్తి వెలగబోశావ్'—అన్నారు ధర్మారాయుడిహితులు చాలామంది

'ముందది రానివ్వండి చూద్దాం బంగారపు కొండ కావాలని కోరటం—వాళ్ల చేతకళ్లు తేలవేయించటం కంటే—వాళ్ల శక్తిని పరీక్షించటానికి యీ మాత్రం చిన్న బహుమానం కోరుకొంటే చాలు నిజం ఆలోచిస్తే, వెధవ గ్రామఫోనే కొనుక్కొనలేనేమిటి?"— అన్నాడు ధర్మారాయుడు ఈమాటలన్నీ ధర్మారాయుడి మామ విన్నాడు—పెండ్లి పూర్తిగా విజయవంతంగా ముగిసింది

న్యాయంగా ధర్మారాయుడు కోరుకొన్న కోర్కె—యే పండుగసందర్భంలోనో తీసుకొనిపోయి మామయిచ్చి వానికి సంతోషాన్ని కల్గించాలి ధర్మారాయుడూ ఆవిధంగానే ఉద్దేశపడ్డాడు! వివాహం అయిన రెండు సంవత్సరాల కాలంలో యే సంవత్సరాదో, యే సంక్రాంతో—పండుగల పేరుతోనో ధర్మారాయుడు వెళ్లి ఉండవలసింది నాలుగుజామార్లూ సంపాదించుకొని యుండవలసింది అతడి అదృష్టం అనండి, దురదృష్టం అనండి-వివాహం అయిన తర్వాత - తన కార్యం జరిగేరోజు దాకా - ధర్మారాయుడు వాళ్ల గుమ్మం యెక్కే అవకాశం లేకపోయింది, తన బహుమానం తెచ్చుకొనటంగాని, పోనీ వాళ్లకు గుర్తుచేయటంగాని జరిగియుండక పోయింది ఎదో పండుగపేరుతో-అల్లుడ్ని తమయింట రెండురోజు లుంచుకోవాలనీ వాళ్ళూ యెంతో తాపత్రయపడ్డారు కాని సమయం వచ్చేసరికి సరిగ్గా యే పురుడో యే పుణ్యమో-గబుక్కున-పండుగకు రెండురోజులు ముందువచ్చి కూర్చునేది వాళ్లుమాత్రం - తీసుకొనిపద్దామనే ఉద్దేశం ఉంటేమాత్రం యీలాంటి అడ్డులు వచ్చినప్పుడు యేం చేయకలుగుతారు?

ధర్మారాయుడు అత్తవారింటికి - తన కార్యం జరిగేరోజువరకూ వెళ్లడానికి వీలులేకపోయింది పోనీ ఆ సమయంలోనయినా - తన పెండ్లినాటి కోరిక మామకు గుర్తుండి తీర్చుతాడేమోనని అతడు భావించాడు, కాని ఆశుభకార్యం-శుభంగా జరిగిపోయింది. ఏమేమో వండిసరకు తనకు కానుకగావచ్చిందిగాని కోరుకొన్న-

ప్రత్యేకంగా అలకపాన్పుమీద - వాగ్దానం పుచ్చుకొని అడిగిన గ్రామఫోనుమాత్రం రాలేదు.

ధర్మారాయుడు, తొందరపాటుమనిషి కాడు; తనకోర్కె యేదో విధంగా నెరవేరి తీరాలి అన్న పెంకిపట్టుమాత్రం అతనిలో ఉంది గ్రామఫోను, నిజం యోచిస్తే, తనకు తానే కొనుక్కోనగలడు- వాగ్దానం పుచ్చుకొన్న మామ దాన్ని కొనియిస్తేనే - దానిలోని అందం, చందం

ధర్మారాయుడు తొందరమనిషి కాడని యిదివరకొక మారు చెప్పాను నిజంగా అతడు తొందరమనిషి అయినట్లైతే— కార్యం రోజునే-యేదోవిధంగా మామను హేళన చేసేవాడు నలుగుర్లోనూ పెద్దమనిషి తాను కోరుకొన్న కోర్కె తప్పక తీరుస్తానని వాగ్దానం చేసినప్పుడు-అవసరం తీరినతర్వాత మాట మారుస్తాడని ధర్మారాయుడు తలపోయలేదు తంబోసినట్లయితే అదినం యెంత గొడవచేయాలో అంతా చేసి ఉండేవాడు!

* * * *

ధర్మారాయుడు బి ఏ పరీక్షలో కృతార్థుడవటం, వెంటనే రాజమండ్రిలో ఉద్యోగం దొరకటం, లలిత కాపురానికి రావటం యించుమించుగా ఒకేమారు జరిగాయి కాపురాని కొచ్చిన లలితయినా తనతోగూడా భర్తగారు కోరిన గ్రామఫోను తీసుకొనిరాలేదు ఆమెకుమాత్రం యెప్పుడో పెండ్లిసందర్భంలో జరిగిన విషయాలు జ్ఞప్తియందుంటాయేమిటి? ఎవరిదాకానో యెందుకు - అటు ధర్మారాయుడి తండ్రికిగాని యిటు మామకుగాని యీ సంగతి గుర్తులో ఉన్నదేమిటి జ్ఞప్తియందుంచుకోవలసిన అగత్యం ఒక్క ధర్మారాయుడికి కలిగిందిగాని!

దైవానుగ్రహం ఉంటే లలితద్వారా తన గ్రామఫోను సంపాదించవచ్చనుకొన్నాడు ధర్మారాయుడు! అందుకనే ఆమెతో విషయం డొంకతిరుగుడుగా యెన్నో విధాలుగా మార్చిచెప్పాడు ఒకమారన్నాడతను కొంతమంది మామలు— అల్లుళ్లు కోరుకున్న కోర్కెలు తీరుస్తామని చెబుతారు. కాని ఆ అవసరం కొంచెం తీరిపోయిందంటే—ఆ విషయం చివరకు మనస్సులోనయినా ఉంచుకోనరు. లలితకు— గ్రామఫోనుసంగతి అసలు స్ఫురణలోకే నేలేదు. అందువల్ల ఆమె తిరిగి ప్రశ్నించటం సంభవించింది 'అందరు నాన్నలూ— మా నాన్నలాంటివా కృతఘ్నులేమిటి?—' ధర్మారాయుడు ఆమె అమాయకత్వానికి నవ్వుకొన్నాడు అతనే అన్నాడు తిరిగి 'ఆ అట్లాగా? మీ నాన్న అల్లుళ్ళకోర్కెలు తప్పకుండా తీరుస్తాడుకాబోలు నేం?'అని

'మీరు చూడలేదూ?' అంది లలిత

'చూడకేం—మీ నాన్న విషయం బాగా తెలుసుకొన్నా' అన్నాడతను నవ్వుతూ.

పాపం లలితమాత్రం విషయం గ్రహించలేకపోయింది

* * * *

మరో సమయంలో ధర్మారావు అన్నాడు ఏవిధంగా నయినా విషయం కదుపుతుందేమో నని 'నాకు గ్రామఫోనంటే యిష్టం - మరి నీకు?' అని

'నాకే వాయిద్యాలన్నా యిష్టంలేదు' అని లలిత ప్రత్యుత్తరంయిచ్చింది అంతటితో మరి ముందు వేసుకొన్న ప్లాను ఫైలయింది కానయితే ధర్మారాయుడు నవ్వుతూ అన్నాడు 'అందుకనే కాబోలు దేవుడు నీకీలాటి కోమల - కోయిలస్వరం యిచ్చాడు' అని.

నిజంగా లలితకు పాట రాకపోటంవల్ల అది తనను ఎగతాళి చేస్తున్నట్లుగా, అర్థం చేసుకొంది ఈలాంటవి కొత్త సంసారాల్లో ఉండేవేగా! అందు వల్ల - మాటకు మాటగా—'మీ కోయిల స్వరం ముందు నా స్వరం యెంతలెండి' అంది

ధర్మారాయుడికీ పాట పాడటం రాదు అందువల్ల అంతటితో అతడు నోరు కట్టివేయవలసివచ్చింది

అతడేవిధంగా ప్రయత్నించినా లలిత విషయాన్ని గ్రహించుకోలేని పరిస్థితిలోనే ఉంది చివరకు మరొకమారు ధర్మారాయుడు డొంకతిరగుడుగా తన అభిప్రాయాన్ని చెప్ప సిద్ధపడ్డాడు

'నేను గ్రామఫోను కొనదల్చుకున్నాను' అన్నాడతను. ఆమె దానిమీద వద్దనో, కొనమనో, మానాన్నను అడగండనో అంటుందని అత డూహించాడు, దానిమీద అలకపాన్పు విషయం గుర్తునకు తెచ్చి మామను యెగతాళిచేయాలని అతడు పథకం నిర్మించుకొన్నాడు

లలిత ఆ మాటలు వింటూ తీవ్రంగా ధర్మారాయుడి వైపు చూస్తూ అంది. 'గ్రామఫోను కొన్నా సరే రేడియో కొన్నా సరే! మీ యిష్టంవచ్చినట్లు చేయండి— చెల్లీ చెల్లకుండా డబ్బు పడుంటే—మీ యిష్టంఅయిన ఖర్చులు చేయచ్చు అయినా తెలియక అడుగుతాను. ఏముందండీ ఆ మాయదారి గ్రామఫోనులో?' అని

'కథ అడ్డం తిరిగింది'—అనుకొన్నాడు. ధర్మారాయుడి మనస్సులో—తన పథకం విషయంలో జరుగుతున్న సంఘటనల విషయం అతడు యోచిస్తుంటే నవ్వు కలసి వస్తోంది.

ఆ సమయంలో అతడన్నమాట లివి: 'మొత్తంమీద తండ్రికితగ్గ కూతురవే. మంచి జవాబిచ్చావ్ ఈమారు మీ గ్రామం వెళ్లినప్పుడు చెప్పు మీ నాన్నతో నే గ్రామఫోను కొనుక్కోనబోతున్నానని!'

అంతటితోనయినా పూర్వకథ జ్ఞప్తికి వస్తుందేమోనని ధర్మారాయుడు ఊహించాడు కాని పూర్వవిషయం ఆమెకు స్ఫురణకు రాలేదు సరిగదా 'మీరు గ్రామఫోను కొనటం యేమిటి నే మానాన్నతో చెప్పటం యేమిటి? అవసరం అయితే మీరే చెప్పండి. అయినా ఆయనతో చెప్పటం యెందుకూ?' అని అంది.

ధర్మారాయునికోపం హెచ్చిపోయింది. తన మాటలకు సరియైన జవాబు యివ్వక పోటంసంగతటుంచి యీ విధంగా 'మా నాన్నగారితో చెప్పటం యెందుకూ?' అని తన్నే యెదురుప్రశ్న వేయటం అతనికి యిష్టంలేదు— కోపంలో ఉండబట్టలేక—'బుద్ధి లేక— కొనుక్కోనలేక' —అని మాత్రం అన్నాడు

లలిత ఆశ్చర్యంతో విషయం అర్థంగాక తెల్లబోయి మాస్తూ ఉండిపోయింది

పట్టుదలలో వివిధరకాల పట్టుదలలు ఉంటాయి అన్ని పట్టుదలలోనూ అల్లుడికి మామగారిమీద ఉండే పట్టుదల—మరి యితరత్రా యెవరివద్దా ఉండదు ఇది సత్యం! ధర్మారాయుడి సందర్భంలో గూడా అంతే! ఎందువల్లనంటే-నిజంగా- రెండు వందల రూపాయలు

ఖర్చు చేసి గ్రామఫోను కొనే శక్తి ధర్మారాయుడికి ఉంది కాని పట్టుదల వచ్చినప్పుడు - అంటే ఒకరు తనకు కొని యిస్తానని వాగ్దానం చేసినప్పుడు - ఆ వస్తువుకు తనచేతి డబ్బు ఖర్చు పెట్టడం, కొనుక్కోనటం అంత శ్రేయస్కరం అయిన పని గాదు అది తన బలహీనత చూపుకోనటం అని అతని ఉద్దేశం ధర్మారాయుడికి పట్టుదల హెచ్చింది, ఏదో విధంగా మామచేత గ్రామఫోను కొనిపించితీరాలి- అది యేలాటి దయినా సరే-యేమయినాసరే ఆయన కొనితీరాలి! అవసరం అయితే తిరిగి తాను మరొకటి కొనుక్కుంటాడు! అయితే గ్రామఫోను కొనియివ్వవలసిందని స్వతహాగా తనకు తాను తెలియపర్చుకోనటం అంత తెలివితక్కువతనం మరొకటి లేదు ఆయన కాయన యీ విషయం జ్ఞప్తికి తెచ్చుకోవాలి. కొనియివ్వాలి! అంతే!

* * *

అనుకొన్నప్రకారంగా పండుగలకు దంపతులు వెళ్లారు అత్తారింటికి అయితే ధర్మారాయుడి అదృష్టమో లేక లలితఅదృష్టమో, లేక మరి దంపతులిరువురి అదృష్టమోగాని యీమారు మాత్రం యేవిధమైన అడ్డంకులూ-పండగకు ఆటంకం కల్గించలేదు!

పండుగ వైభవంగా జరిగిపోయింది ధర్మారాయుడికి మాత్రం తన అల్లుని బెట్టు ప్రదర్శించాలనే ఆదుర్దా హెచ్చుగా పీడిస్తోంది తగినట్లుగా సమయం కూడా వచ్చింది సాధారణ అల్లుళ్లకు లభ్యం అయ్యే జామారేకాకుండా రిస్టువాచీ గూడా ధర్మారాయుడికి లభ్యం అయింది వాటిని పుచ్చుకొనవలసిందని చెబుతూ మామయ్య అన్నాడు. 'ఏమిటో పెండ్లయిన తర్వాత నాలుగుపండుగలు జరిగాయ్ ప్రతీ పండుగకూ యేదో ఆటంకం వస్తూనే ఉంది దేవుడిదయవల్ల యీనాటికయినా - మీ దంపతులు-ఈయింట్లో తిరిగి ఆనందాన్ని చేకూర్చారు వాచీ పెట్టుకొని కొత్తబట్టలు కట్టుకో' అని

ధర్మారాయుడు మామయెదుట 'నాకీ వాచీ అక్కర్లేదండీ'-అనిమాత్రం అనకలిగాడు!

'ఏం నాయనా?'-అని ఆయన ప్రశ్నించాడు

'వాచీ నే కొనుక్కోగలను లెండి'- అని ధర్మారాయుడి సమాధానం

ఈ సమాధానం ధర్మారాయుడి మామకు మంచి ఆశ్చర్యం కల్గించింది

'కొనుక్కోనలేకపోవటం యేమిటి నాయనా మా ఆనందం కొద్దీ - మేం యిస్తున్నప్పుడు, మాకు సంతోషం కల్గించటంకోసం నువ్వు తీసుకోవాలి' అన్నాడాయన

'మాకు ఆనందం యిచ్చేవి మేము కోరుకొన్నవి వాటిని మీరు యిచ్చి ఆనందం కల్గించాలి' - అన్నాడు ధర్మారాయుడు

ఆయన విషయం సరిగా బోధపరచుకొనలేక 'సరే నీయిష్టం నాయనా బట్టలయినా మరికట్టుకుంటావా?'-అని అంటూ లోపలికి వెళ్లాడు లలిత వచ్చి— విషయం గ్రహించలేక-ఏమండీ ఆ కోపంగేనికి? పండుగపూటవాచీ చేతిని పెట్టుకొని పెద్దవాళ్లకు ఆనందం కల్గించకుండా—ఏమిటీ పెంకితనం?' అంది ఆమె

'నా పెంకితనం నావద్దనే ఉంటుంది నా విషయం నీకనవసరం' అన్నాడు ధర్మారాయుడు, కోపం మొహంలో చూపిస్తూ

తెగోతూ ఆమెగూడా లోనికి వెళ్లిపోయింది నిజంగా ధర్మారాయుడికి కోపం లేదు, వాళ్ళు వెలితగాత తన పాచిక పారుతున్నందుకు లోలోన నవ్వుకొన్నాడు!

అల్లుని నడవడివిషయం యింట్లో పెద్ద చర్చ జరిగింది ఆ సందర్భంలోనే— ధర్మారాయుడికి కావలసిన మాటలు గూడా దొర్లాయి లలిత అన్ని విషయాలూ చెప్పింది గ్రామఫోనుసంగతి యెత్తటంతోటే—ధర్మారాయుడి మామకు విషయం తెలిసివచ్చింది కారణం బోధపడింది

ఆయన ధర్మారాయుడివద్దకు వెళ్లి, 'నాయనా ఆమాత్రందానికి కోపం యెందుకోయ్ పనుపోసడి ఆ సంగతే మరచిపోయాను ఒక నెలరోజుల్లో నువ్వు కోరుకొన్న పోను తప్పక కొనియిస్తాను ముందివి తీసుకో'_

ధర్మారాయుడు- లోలోన సంతోషించాడు, ఎందుకులెండి అంటూనే నూతన వస్త్రాలు ధరించటం చేతికి వాచీ పెట్టుకొనటం జరిపాడు!

పండుగ సంతోషంగా వెళిపోయింది భార్య భర్తకోసం, భర్త ఉద్యోగంకోసం తిరిగి రాజమండ్రి చేరుకొన్నారు!

మామ యిచ్చిన షరతు ప్రకారం నెలరోజులకాలం దాటిపోయింది ఆయన ఉలకక పలకక ఊరుకొనేసరికి తిరిగి ధర్మారాయుడికి కోపం పుట్టుకువచ్చింది, పట్టుదల అభివృద్ధిపొందింది ధర్మారావు స్వయంగా గ్రామఫోను కొనుక్కోనకలడు, కాని కొనటం యిష్టంలేదు, తన పట్టుదల యేదోవిధంగానెగ్గాలి! నెగ్గితీరాలి

తాను-విషయం మరచలేదన్న సంగతి తెల్పుతున్నట్లుగా-స్నేహితుని యెరువు గ్రామఫోను క్రొత్తది ఒకటి తెచ్చి యింట్లో ఉంచాడు, రాత్రింబగల్లు యేకధాటిగా వేసిన రికార్డు వేస్తూ, తీసిన రికార్డు తీస్తూ లలితకు మంచి విసుగు తెప్పించాడు, కాని యేంచేస్తుంది? ఆమె కొంచెం విసుగుదలతో నోరు తెరుస్తే చాలు 'ఏం చేయమంటావ్ కొనిచ్చేది లేకపోయినా కనీసం కోర్కెయినా తీర్చుకొనవద్దంటావా ? - ఎరువు సొమ్ము ఎంతకాలం యింట్లో ఉంటుంది? కొనుక్కోన్న కొత్తవస్తువు స్నేహితుణ్ణి బతిమాలి తేయిచ్చాడు' అనేవాడు ధర్మారాయుడునవ్వుతూ ఆఫీసు సమయం మినహా - అన్ని కాలాల్లోనూ గ్రామఫోను మ్రోగుతూనే ఉండేది

మొత్తంమీద ధర్మారాయుడిమామ- అల్లుని కోర్కె తీర్చటానికని వచ్చాడు ఇంట్లో గ్రామఫోను మ్రోగుతోంది-అల్లుడు యింట్లోలేని సమయంలో- ఎవరిది యేమి అని- కుమార్తెను ప్రశ్నించి— ఫోను వివరాలు తెలిసికొని—బజారుకు వెళ్ళాడు!

సాయంకాలం - ధర్మారాయుడు తిరిగి వచ్చి— 'రువు తెచ్చిన గ్రామఫోను పంపివేయబోతూంటే-హఠాత్తుగా అది క్రింద పడి - దెబ్బతింది రికార్డులు ముక్కలయ్యాయి స్ప్రింగు తెగింది

సరిగ్గా యీ సంఘటన జరిగిన సమయంలోనే ధర్మారాయుడి మామ అనేరకం —క్రొత్త గ్రామఫోనుతో, పరికొత్త రికార్డులతో లోపలికి వచ్చాడు

తన సంగతి అటుంచి, ఎరువు గ్రామఫోను పంపవలసిన అవసరం ధర్మారాయుడి మీద ఉండిపోయింది అంగుళ్లు ముందూ వెనకా యోచించకుండా — మామయ్య తెచ్చిన సరికొత్త గ్రామఫోను, రికార్డులతో సహితంగా తాను యెరువు తెచ్చుకొన్నవాళ్ళకు గీనిని అప్పగించి వచ్చాడు

ధర్మారాయుడికి-స్ప్రింగు తెగిన గ్రామఫోనూ, విరిగి ముక్కలయిన ప్లేట్లూ మిగిలాయి ఇదంతా చూచిన ధర్మారాయుడి మామ మాత్రం—ఊరుకుండలేక — తిరిగి గ్రామఫోను పాతిక రూపాయలతో బాగు చేయించి—ముప్పై కొత్త రికార్డులు కొనియిచ్చాడు!

ఈ సంఘటనకు అంతా ఆశ్చర్యపోయారు ధర్మారాయుడి మామ జరిగిన విషయం తలచుకొంటూ ఉస్సురను కొన్నాడు కాని ధర్మారాయుడు మాత్రం —గ్రామఫోను మామచేత కొనిపించాడు గదా అని సంతోషించాడు!



# కామాంధుడు

(16-వ పేజీ తరువాయి)

భయమేమిటి? మీఅయ్య నూడు మాదగ్గర ఎంతకాలంనించి వుంటున్నాడో రేపటి నుంచి శుభ్రంగా వచ్చి పనిచేయి (వెంకన్నతో) వెంకాయ్! లచ్చిని రేపు మన యింటికి తీసుకురా ఇంటిపనిలో ప్రవేశపెట్టు శుభ్రంగా నీడపట్టున బ్రతుకుతుంది

ల వద్దులెగండి బాబయ్యా! నాకు మనసొల్లదు (తండ్రితో) అయ్యా! వద్దులేయె నాను యిళ్ళలో పనిసేయనే

కాం (కొంచెం నిరుత్సాహంతో) అంత భయమైతే ఎలాగే, లచ్చీ! సరె. వెంకాయ్! ఆలోచించి ఒప్పుకుంటే ప్రవేశపెట్టు

(వెళ్ళిపోవును)

* * *

2 వ దృశ్యము [వెంకన్న గుడిసె— మిట్టమధ్యాహ్నం — కాంతారావు ప్రవేశం ]

కాం వెంకాయ్! వెంకాయ్! (లోనికి ప్రవేశిస్తూ)

(లచ్చిలోపల వుంటుంది)

ల (కాంతారావువైపు కొంచెం ఆశ్చర్యంగా చూచి) ఏం, బాబయ్యా! ఇంత అగ్గిలో వచ్చారు అయ్యలేడే-యింట్లో

కాం అహో- ఎక్కడికి వెళ్ళాడు?— ఇప్పుడే వస్తాడా?

ల గిత్తలు తోలుకుపోయాడు సందకాడ వస్తాడు అయ్యా!

కాం (సంతోషం కనబరుస్తూ) లచ్చీ! సరేగానీ

ల ఏంది దొరా?

కాం ఆ ఏంలేదుగానీ నీవు ఇలా పొలాల్లో ఎండనక వాననక పని చెయ్యటం బాగాలేదు లచ్చీ శుభ్రంగా నే చెప్పినట్లు చేస్తే

ల (తల వంచుకొని) కూలి జేసుకునే వోళ్ళకి ఎండేంటిలే బాబూ ఏదో ఆయిగ బతుకుతుండాం ఇళ్ళలో పని చెయ్య బుద్దెగదు

కాం మా యింట్లో సుఖంగా పనిచేసుకు బ్రతకవచ్చంటే వినటంలేదుగదా (భావయుక్తంగా చూస్తూ) లచ్చీ! చూడు నీ సుఖంకోరి చెప్తున్నా మాయింట్లో పనిచేసుకో (లచ్చిని సమీపిస్తూ ) నామాట విను

ల (ప్రక్కకు జరిగి) లేనిపోని చుకాలెందుకు లెగండి బాబు కూలోళ్ళకి

కాం. కాదులచ్చీ! నీలో ఎంతో సౌందర్యాన్ని ఇమిడ్చాడు భగవంతుడు కే దానిద్వారా నన్ను ఆకర్షించావు అందుకు నీసుఖంకోరుతున్నా. నీసుఖమే నాసుఖం లచ్చీ

ల అవూ సెందుకులే బాబూ! నా కొద్దంటిని గా

కాం (కామావేశంతో చెంత చేరుతూ ఆమెను స్పర్శించబోతూ) లచ్చీ! ఈ చినిగిపోయినపాత పీలికలుకన్నా చక్కటిచీరలు కట్టుకోవచు నా మాట విను

ల (కొంచెం కోపంతో - విసుగుబాటుతో) లెగండి బాబయ్యా! మా అయ్యగూడ లేడు మీ మాట లేంది సీమంతులు మాతో సరసాలాడబోతారేంటి దొరా! మేం నీతిగా బతికేవాళ్ళం దొరా (వెనక్కిపోవును )

కాం (లచ్చి చెయ్యిపట్టుకొని) లచ్చీ! నా మాట వినవూ!

ల (చెయ్యి విదిల్చి) ఎల్లండి బాబయ్యా! కూలోళ్ళబుద్ధి కుక్కబుద్ధనుకున్నారా! మాకు వంచెం కులం మరాద వుంది

కాం (కోపంతో గంభీరంగా) లచ్చీ! చాలా మూర్ఖంగా వున్నావు ఎవరితో మాట్లాడుతున్నావో గ్రహించు

ల ఆ! గ్రహించా కామందులతో

కాం (ఏదో ఆలోచించి - తల వూపుతూ) సరే! లచ్చీ! కానీ నీవు విదిల్చింది కాంతారావునే గదా

ల సత్తెంగా బతికేనోళ్ళకి బయమేటి! (బయటకు వెళ్ళును)

(కాంతారావు తాను లచ్చికి ఇద్దామనుకున్న డబ్బు ఫర్సుతో కూడా లచ్చి యింటిలో చూర్లో త్వరగా దాచి బయటికి వస్తాడు )

* * *

3 వ దృశ్యం - [వెంకన్న గృహం— సాయం సమయం—లచ్చి విచారంగా దిగాలుబడి కూర్చుంటుంది - వెంకన్న ప్రవేశం ]

వెం తల్లీ! లచ్చా! అలాగుండావేం అమ్మా!

లచ్చి (కంటినీటిని ప్రక్కకుతిరిగి తుడుచుకొని-నవ్వును అభినయిస్తూ) ఏం లేదయ్యా

వెం ఏం తల్లీ! మీఅమ్మ గాపకం వచ్చిందా నాతల్లే (రెండు బాష్పబిందువులు పడి భూమిలో యింకిపోతాయి )

ల (తండ్రి కన్నీరు చూచి) ఏం లేదు- అయ్యా-వూరికే నే బెంగపడతావు గిత్తల్ని తోలి తెళ్ళావు గందా (తొట్రుపడుతూ) ఇందాక రామాయి బాబాయి వొచ్చాడు— మరేమో (బూట్ల చప్పుడు) ఎవరో వత్తుండారే

(పోలీసు ఇనస్పెక్టరు - కాంతారావు - ఇద్దరు పోలీసులు ప్రవేశింతురు )

ఇనస్పెక్టరు ఏయ్! ఎవరక్కడ?

(వెంకన్న గుడిసెబయటకువచ్చి ఆశ్చర్య భయాలతో)

వెం ఏంది దొరా! నాను ఎంకన్నని

ఇన ఆ నీవేనా వెంకన్నవి? కాంతారావుగారి ఫర్సు దొంగిలించినట్లు అనుమానంగా వుంది

వెం (దిగ్భ్రమతో) ఏంది దొరా! కాంతాబాబుగారి డబ్బు నా నా కాజేత్తా (లచ్చి భయంతో ప్రవేశం) నాన సత్తెంగా ఏమి ఎరగను బాబూ

ఇన 21, ! వెళ్ళి ఇల్లు సోదా చెయ్యి

ల (ఆశ్చర్యంతో-దుఃఖంతో) ఏంటి బాబూ! మాఅయ్య దొంగతనంచేశాడా ఏం- ఎరగం దొరా సత్తెం బాబూ

(ఫర్సుతో పోలీసు ప్రవేశం )

ఇన వెంకన్నా! రుజువయ్యింది ఠాణాకి పద పోలీస్ లాకప్, (పోలీసు వెంకన్నకి జోడు వేస్తారు)

లచ్చి (పొరలివచ్చే ఏడుపుతో) అయ్యా! ఏపాపం ఎరగనోళ్ళకి ఏం బాబూ! మాఅయ్యని ఎక్కడికి తీసుకుపోతారు

కాం (ఆవేశంతో) దొంగతనానికి ఫలితం ఏమనుకున్నావు?

(రామయ్య కుటుంబం, ఇంకా చుట్టుపక్కలవాళ్లు వస్తారు)

వెం రామన్నా! లచ్చి-నీకూతురుగా చేస్తుండా-కూలినాలి చేసి నీకిత్తుంది కొంచెం గంజోసి చూత్తుండు (ఏడ్పు)

లచ్చి అయ్యా! అయ్యా! అయ్యా!

(వెంకయ్యని తీసుకొనిపోదురు)

* * *

4 వ దృశ్యము [వెంకన్న గుడిసె— ఉదయం 8 గం॥ లు- లచ్చి బక్క-చిక్కి దిగులుతో లోపల కూర్చునివుంటుంది]

ల (తనలో) అయ్యా! ఏ పాపం ఎరక్కపోనా పుట్టిపుణ్ణాన్కి రాచ్చస పోళ్ళు కొట్టుపెట్టారు - ఏంకట్టాలు పెడు తుండారో (కళ్లునీళ్ళతో నిండుతాయి) అమ్మోమో యీ లోకం యిడిసే పోయింది నీ యోమో అలా కట్టాలు పడుతుండావ్ (నిస్పృహతో) నాను మొండిగా ఎంగుకు బతకటం ఎంగుకీ జల్మ యింకొను (నిట్టూర్పుతో) అమ్మా బాబూ

(కొంతారావు ప్రవేశము)

కొం (సంతోషపూర్వకంగా) ఆ! లచ్చి! నీ హృదయం పరివర్తనం చెంది నట్టుందే నా రాక నీ కానందం కల్గించిందా? ఇప్పటికైనా నాబిగి కౌగిటి కంగీకరిస్తే నీ అయ్యని తక్షణం వదిలి పెటే ఏర్పాటుచేస్తా మీ యిద్దరిక్కి అన్ని సౌకర్యాలు చేకూరుస్తా ఏ

ల (బావయుక్తంగా కొంచెం హేయంగా) ఏం యాదయ్యా! నేనేందో భగిమంతుణ్ణి అనుకుంటే ఎడ్నుంచో వచ్చి ఆ! ఆ! అంతావు చేసువుగా మా అయ్యకి ఉపకాడం-నీదారిని ఎళ్ళుకో బయ్యా! కిందకులాలోళ్ళు అంటే నీతిలేని వాళ్ళనుకుంటారేంది? (అవమానంతో) అది సీమంతులిళ్ళల్లోని వుండింది మేం సానిపోళ్ళ మనుకున్నవా?—

కొం కాదు లచ్చి! (కామావేశంతో చేతులు కౌగిటికి చాస్తూ) నీ పొందుకోసం పరితపిస్తున్నా! ఏదో ఆవేశంతో మీ అయ్యని జైల్లోపెట్టించా వెంటనే యిడిపిస్తా (సమీపించి స్పృశించబోవును)

ల (ఉద్రిక్తయై లేచి) ఏం దది? ఆడది ఒంటరిగా వుంటే లోకువా! మాకు గౌరవం,మరాద వుంది (కోపంతో కొంతారావును వెనక్కి బలవంతంగా నెట్టును కొంతారావు తల ద్వారాన్కి తకీుని తగులుతుంది సమీపంలో వున్న రామయ్యయింట్లోంచి కేక "లచ్చి! వణ్ణాన్కి రా అమ్మా") 

కొం (తొట్రుపాటుతో—వెళ్ళిపోతూ) లచ్చి! చూచుకో నాతడాఖా [వళ్ళిపోవును]

ల (కన్నీటితో) పాడుజన్మ! ఈ పాపిష్టి ఎదవ నాపంచాన్ని నాచనం చేద్దామనుకున్నాడు పోగరు మోతు ఇంతతో నాను అఖరై తేనే పుణ్ణెం వుంటంది (నిశ్చయ సూచకంగా) సరె

* * *

5 వ దృశ్యము [వెంకన్న గుడిసె— సాయంసంధ్య-వెంకన్న విషాదచ్ఛాయలు పొడచూపే ఒప్పకాయంతో ప్రవేశము]

వెం లచ్చి! తల్లీ! (నిశ్శబ్దం)

లేదేం చెప్పా! కూలికి పోయింది గామోలు అయినా యిందాకా కూలేంది (గుడిసె చూసి) తలుపు దగ్గరేసే వుందే (లోపల చూచివచ్చి) ఇల్లు అలాగుందే! పూడ్చినట్టు లేదే! . తల్లీ! లచ్చి! (ప్రక్కకు నడచి) ఆదుగో నాలచ్చి ఆప్రక్క దొడ్డో చెట్టు దగ్గిరుందే

అటునడచి తల్లీ! (నిశ్శబ్దం సమీపించి) పరీక్షించి వణికిపోతూ . గుండె దడ అధికమై లచ్చి! వా తల్లీ! ఎంత పని చేశావే తల్లీ! తల్లీ! తల్లీ!

(కూతురు వురి చూసి . క్రిందపడి పోతాడు)



# నా మరదళ్లు

(8-వ పేజీ తరువాయి)

మరచేపోయాను మా వూరి స్టేషన్‌గూడ దాటి బండి ఎంతో దూరం రాలేదు వెంటనే గొలుసు లాగుదామని చెయ్యెత్తాను చటుక్కున రైల్వే రూల్స్ నా బుర్రలో పకపక నవ్వినాయి నాకు ఏడుపు పర్యంతం వచ్చింది బండిలో అంతమంది జనం ఉన్నారుగాని నేనొక్కణ్ణే అయితే బిగ్గరగా ఏడ్చేవాణ్ణే

9-20 కల్లా బండి మా అత్తవారి వూళ్ళో ఆగింది నేను బండి దిగాను నాకోసం ఎవరైనా వచ్చారేమోనని ప్లాట్‌ఫారం నాలుగుమూలల వెదికాను మా ఆఖరు బావమరిది శంకరం బండి ఆ చివరనుంచి ప్రతిపెట్టె చూచుకుంటూ వస్తున్నాడు ఇంకా వాడికి శ్రమ ఇవ్వటానికి మనస్సొప్పక "శంకరం" అని కేక వేశాను

"వచ్చావా బావా" అంటూ శంకరం నాదగ్గరకు పరుగెత్తుకవచ్చాడు టిక్కెట్ ఇచ్చి బయటకువచ్చి ఒక జట్కా మాట్లాడి ఇద్దరం ఎక్కాం

బండి వాకిట్లో ఆగీగానే మా శ్రీవారు చెంబుతో నీళ్లు తీసుకవచ్చి చిరునవ్వుతో ఆహ్వానించి చెంబు చేతి కిచ్చింది కాళ్లు కడుక్కుంటుండగానే మా ఆరేళ్ళ మరదలు పిల్ల ప్రారంభించింది "బావా బావా పన్నీరు, బావనుపట్టుక తన్నేరు" అని ఇక మొదలురా బాబు అని అనుకున్నాను

ఇంట్లో కెళ్లేటప్పటికి ఇల్లంతా పెళ్లివారి ఇల్లులాగ కళకళలాడుతోంది మా నలుగురు బావమరుదులు, వాళ్ల ముగ్గురు భార్యలు, అంటే మా ఆఖరి బావమరిది శంకరానికింకా పెళ్లి కాలేదు ఇంటర్ మిడియేట్ చదువుతున్నాడు మా బావమరుదుల పిల్లలు మొత్తం ఓ అరడజనుకుంది, మా ఒదినగారు అంటే మా శ్రీవారి అప్పగారన్నమాట ఆవిడ ఇద్దరు పిల్లలూ మా మరదళ్లు ముగ్గురూ ఇల్లంతా హడావిడిగా ఉంది. మా పెద్దమరదలకు పదహారేళ్లు ఉంటాయి ఇపుడే పెళ్లి సంబంధాలు వస్తున్నాయి మహాకొంటెపిల్ల మా రెండో మరదలకు పదమూడేళ్లు ఉంటాయి కొంటెతనంలో మా పెద్దమరదలకు చేదోడు వాదోడుగా ఉంటుంది మా అత్తవారింటికి వెళ్లడమంటే సరదాయే కానీండి ఈ కొంటెపిల్లల్ని చూడగానే సగం సరదా చస్తుంది నేగనక వచ్చానంటే వాళ్ల కొంటెతనమంతా నా మీదే ప్రయోగం వాళ్లు కొంచెంగూడ మా అన్నయ్యమీద ప్రయోగించరు అంతా నామీదే ఎందుకంటె ఆయన కొంచం కోపిష్టిమనిషిలెండి, అందుకని

గుమ్మంలో కాలుపెట్టగానే మా పెద్ద మరదలు వచ్చి "ఏమండోయ్ బావగారూ వచ్చారూ పండుగ పిండివంటలు చెల్లవనుకున్నాను" అంది

"చచ్చాన్రా బాబు, అప్పుడే మొదలు పెట్టింది"అని అనుకొని "దిగులుపడ్డా, ఇప్పుడేముందిలే మా తమ్ముడు గూడ రానీ —"అని అన్నా

మా శ్రీవారు "అప్పుడే మొదలెట్టారూ పరాచకాలూ మీరూను" అని వాళ్లను లోపలకు పంపి నాకు కుర్చీ చూపించింది నాకు మున్ముందు నా మరదళ్లవల్ల పరాచకాస్త్రాలు ఏవిధంగా ఏరూపంలో ప్రయోగింపబడతాయి, వాటి నివారణోపాయములు ఏమిటి అని ఆలోచించుకుంటూ కూర్చున్నా. కొంచంసేపటికి మా మామగారు, అత్తగారు, బావమరదులూ క్రమం తప్పకుండ వచ్చి పరామర్శించి వెళ్ళిపోయారు చివరకు శంకరం వచ్చాడు వాడు నేను కొంచెం సోషల్‌గా ఉంటాం లెండి వాడు వచ్చినతర్వాత సినిమాల దగ్గర్నుంచి, సిగరెట్లవరకు ఆంధ్రరాష్ట్ర సమస్య మొదలుకొని అధికాహారోత్పత్తి వరకు, ఆర్థిక విషయాలు మొదలుకొని మా బ్యాంకు వ్యవహారాలవరకు చర్చించుకున్నాం వంటఇంటిలోంచి ఆహ్వానం రాగానే భోజనంచేసి నాకై ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన గదిలో ప్రవేశించా

* * *

మరునాటి ఉదయం శ్రీవారు లేచి వెళ్తూవెళ్తూ "చప్పున లేవండి తలంటికి" అని చెప్పివెళ్లింది "ఆఁ లెగుస్తాలే" అని మళ్లా దుప్పటి నిగడతన్ని పడుకున్నా

మరో అరగంటకు మా పెద్దమరదలువచ్చి "బావగారూ లెగుస్తారా కట్టెతెమ్మనమంటారా?" అని గద్దించింది

"మా ఆవిడ కాబట్టి సమాధానం చెప్పగలిగాను నీకు సమాధానం చెప్పటం మహాకష్టం" అని అనుకొని లేచి ఆవిణ్ణి అనుసరించా

దొడ్లోకి తీసుకవెళ్లి ఒక పీట చూపెట్టి "ఇలా కూర్చోండి పళ్లపొడి తాటాకు తీసుక వస్తాను" అని గద్దించింది

"ఏమిటోవ్, బావగారిమీద పెత్తనం చెలాయిస్తున్నావ్" అంది మా అత్తగారు వేడినీళ్లు బిందెలోకి తోడుతూ

"ఎవర్ని చేసుకుంటుందోగాని వాడి హతమారుస్తుందండి కొంచం గడుసువాణ్ణి చూసి కట్టండి" అని నే అన్నా.

"ఏదో నాయనా దానికూడ గుప్పెడు గింజలు పడితే ఒకబారం వదిలినా వదిలినట్లే" అని అంది మా అత్తగారు

"ఏమిటండోయ్, బావగారూ నామీద చాడీలు మహా చెపుతున్నారు" అంటూ వచ్చి చెంబూ తాటాకు అక్కడపెట్టి వెళ్లిపోయింది

ముఖమార్జన అదీఅయినతర్వాత మంగలి నన్ను కూర్చోబెట్టి తలంటుతున్నాడు

ఇంతలో మా మరదలు వచ్చి "ఒరే సుబ్బడూ దరువు బాగా వెయ్యరా" అని అంది

"ఒరే నలుగుపాట పాడమనరా" అని అన్నా ఎన్. టి. రామారావు పోజుపెట్టి

"సరే, అక్కను పిలుచకవస్తాలే" అని తుఱ్ఱుమంది

స్నానంఅయిన తర్వాత మా బావమరిది తెచ్చిన ఉప్మా, కాఫీ సేవించి ఏమీ తోచక అలా బజారుపోయి తిరిగి 12 గంటలకు తయారయ్యాను

మధ్యాహ్నం భోజనాలైపోయినాయి నేను నాకై ఏర్పాటుచేసిన గదిలోకి చేరాను కొంచంసేపటికి మా పెద్దమరదలు వచ్చి ఒక కిళ్లీ ఇచ్చి "వేసుకోండి"అంటూ చేతిలో పెట్టింది

"ఏమిటా ఇంత అప్యాయంగా తెచ్చి ఇస్తోంది" అని అనుకున్నా ఎందుకో ఆ కిళ్లీని చూడగానే అనుమానం వేసింది "పరాచకానికి మరదళ్లు బావలకు కిళ్లీలలో చింతపిక్కలు, గులకరాళ్లు వేసిఇస్తారని అనుభవశాలురు చెప్పేమాటలు నాబుర్రలో ప్రతిధ్వనించినాయి ఎందుకైనా మంచిదని "కాసిని మంచినీళ్లు తెచ్చిపెట్టమ్మా తాగి కిళ్ళీ వేసుకుంటాను" అని అన్నా

తీసుకరానంటె, నే అనుమానమేదైనా పడతానేమోనని వెంటనే వెళ్ళింది

చెప్పటం మరచాను నేను ఉదయం బజారువెళ్లినపుడు కిళ్ళీ వేసుకుందామని కిళ్ళీకొట్టుదగ్గర కిళ్ళీకొంటూంటే ఒక స్నేహితుడు కనబడ్డాడు సరే, రెండు కిళ్ళీలను ఇవ్వమన్నాను ఒకటి నే వేసుకొని రెండోది వాడికియ్యబోతే నేను వేసుకోనని ఎంత బలవంతం చేసినా కిళ్ళీ తీసుకోలేదు మళ్లా కిళ్ళీ కొట్టువాడికివ్వటం నాగరిక లక్షణం కాదనుకొని అది జేబులో వేసుకొన్నా ఆ కిళ్ళీ ఇంకా జేబులోనే ఉంది మా మరదలు మంచినీరు తేవడానికి లోపలికి వెళ్లగానే చటుక్కున మా మరదలు ఇచ్చిన కిళ్ళీ జేబులో వేసుకొని జేబులోని కిళ్ళీ చేతో పట్టుకుని కూర్చున్నా.

మా మరదలు తిరిగివచ్చి మంచినీరు తెచ్చి ఇచ్చింది వచ్చేటప్పుడు తన అసి

స్నెంట్, చెల్లెల్ని గూడ వెంటబెట్టుకొచ్చింది

"బావగారూ కిళ్ళీ వేసుకోరేమండీ అంటూ మా చిన్నమరదలు హెచ్చరించింది

"ఇదుగో వేసుకుంటున్నా"నని మంచినీళ్లు నోటిదగ్గర పెట్టి తీసి కిళ్ళీ నోట్లో వేసుకొని నమల సాగాను

మా మరదళ్లిద్దరూ ఒక నిముషంసేపు వింతగా నావంక చూచారు నాలో ఏ మార్పూ రాకపోవడం చూసి ఇద్దరూ చాల ఆశ్చర్యపోయారు

"హాలాహలాన్ని కంఠంలో ఇముడ్చుకొన్న ఆ నీలకంఠుడు కూడ మనం కిళ్ళీకి రాసిన సున్నానికి తట్టుకోలేడే, మరి మన బావగారు మిఠాయి తింటున్నట్లు తింటున్నారే" అని మా చిన్నమరదలుతో నెమ్మదిగా రహస్యంగా అంటోంది మా పెద్ద మరదలు

ఆమాటలు విని నేను భగవంతుడికి వెయ్యి నమస్కారాలు చేశాను స్నేహితుని రూపంలో కిళ్ళీకొట్టువద్ద ప్రత్యక్షమై రక్షించావని

మధ్యాహ్నం నిద్రరావడం లేదు ఎలా వస్తుంది? ఆవేళకు బ్యాంకులో క్యాష్ పెట్టె దగ్గర కూర్చుని నోట్లు లెక్క పెడుతుండే వాణ్ణయ్యె దాదాపు ఒక గంట గడిచింది

అంత ఘాటు కిళ్ళీ ఎలా నమలగలిగాడా అని అనుకొని నన్ను వింతగా చూస్తూ వెళ్ళిన మా పెద్దమరదలు చిన్న మరదలు కంటె తొందరగా భోజనంచేసి వచ్చింది.

"ఒదినా ఒక కిళ్ళీఉంటే ఇయ్యవమ్మా" అని అడిగింది

"అదుగో ఆ గదిలో డ్రాయర్ మీద ఒక కిళ్ళీ మీ అన్నయ్యకోసరమని కిళ్ళీ కడితే అది ఆయన తీసుకోకుండా బయటకు వెళ్లారు అది నీవు తీసుకో మీ అన్నయ్యకు ఇంకొకటి కట్టియిస్తాలే" అంది మా బావమరిది పెళ్లాం

ఆ గదిఅంటే నే ఉన్న గదేనన్నమాట తల ఎత్తి చూచాను డ్రాయర్ మీద కిళ్ళీ ఉంది వెంటనే లేచి ఆ కిళ్ళీతీసి నా జేబులో వేసుకొని ఆ స్థానంలో మా మరదలు ఒక గంటక్రితం నాకు ఇచ్చిన కిళ్ళీ పెట్టాను ఏమీ తెలియనివాడిలాగ మంచం మీద కళ్లు మూసుకుని పడుకున్నా.

ఓ ఐదు నిముషాలకల్లా మా పెద్దమరదలు "అమ్మో . నాయనో" అని అంటూ వాళ్ళ ఒదినమీద కోరాలు మిరియాలు నూరుతోంది

"ఇదేం గొడవమ్మా నాకేం తెలుసు? కిళ్లీ అడిగారని మీ అన్నయ్యకోసం కట్టిన కిళ్లీ ఇచ్చాను భోగిపండుగపూట ఇలాంటి పని చేస్తానటమ్మా" అని అంటోంది ఆవిడ

నే చేసిన యుక్తి ఫలించినదన్నమాట అని నాలో అనుకుంటూ నవ్వుకుంటుండగా నే అప్రళయమంతా నాగది వైపు మళ్లింది మా పెద్ద మరదలతోపాటు మా ఆవిడ, ఒదినగారూ, ఇద్దరు బావమరుదులు, మా అత్తగారు, అన్నం తింటున్న చేత్తో లేచి వచ్చిన మా చిన్న మరదలూ అంతా నాగదిలోకి వచ్చారు

"నేను లేచి ఏమిటీ హడావిడి అంటాను" అని అన్నా ఏమీ తెలియని వాడిలాగ

"అబ్బ, ఏం తెలియదేం మా అక్కకు సున్నం ఎక్కువ రాసిన కిళ్ళీఇచ్చి " అంది మా చిన్న మరదలు

"అయ్యో పాపం పొరబాటున సున్నం ఎక్కువ రాసి ఉంటుంది ఇది ఇందాక మీరు నాకు ఇచ్చిన కిళ్లీయే నేనే అది మార్చి అక్కడ పెట్టాను సున్నం ఎక్కువ రాసిందని నాకేం తెలుసు "అని అన్నాను నేను

"అదా కథ" అంది మా ఆవిడ

"ఏం, పర్వాలేదులే" అన్నాడు మా రెండో బావమరిది

"మీనాన్నకి రేపటిపండుగ అప్పచ్చులు రాహిత్యం చేసిందిలే" అన్నా నేను

"రేపు మీ ఆయనే ఇలా చేస్తే ఏం చేస్తావే"అన్నాడు మా మూడోబావమరిది

"తగిన శాస్తి అయింది" అన్నది మా అత్తగారు.

"ఊఁ సరే ఇక ఇవతలకు రండి" అన్నారు మా-మామగారు

తనకు ఎవరూ సానుభూతి అయినా చూపించలేదని మా మరదలుయొక్క ఉక్రోషం మరింత ఎక్కువ అయింది

సాయంకాలం మా మరదలు నాదగ్గరకు వచ్చి "భలేపని చేశావ్ బావా, నానోరు చూడు ఎలా పొక్కిందో" అని అంది

"హాలాహలాన్ని కంఠంలో ఇముడ్చుకొన్న ఆ నీలకంఠుడుకూడ ఇముడ్చుకోలేని సున్నాన్ని కంఠంలో ఇముడ్చుకొన్న ఓ మరదలుపిల్లా! తప్పెవరిది అంటావ్? అని ప్రశ్నించాను.

"నాదే" అన్నది

"ఫలితం? రేపు చేయబోయే గారెలు నీ నోరు ఊరిస్తాయి అంతే" అని అన్నా

"తగిన శాస్తి అయిందిలే బావా" అని నవ్వుతూ వెళ్లిపోయింది

*　　*　　*

ఆమరుచటిదినం మా చిన్న మరదలు నన్ను ఏడిపించాలని చూసింది ఆవిడ చేసేప్రయత్నాలన్నీ ముందే పసికట్టాను కాని అసలు సమయం వచ్చేసరికి నా మతిభ్రమించినంత పని అయింది

ఆరోజున ఏదో పనుండి మా మూడో బావమరిది గదిలోకి వెళ్లాను నేను గదిలోకి వెళ్లగానే వెనకాలే మా చిన్నమరదలు తయారయింది వచ్చినది ఊరుకోక ఏదో దీర్ఘసంభాషణ ప్రారంభించింది సంభాషణ మధ్యలో ఆపి "అయ్యో బావగారూ ఇంతసేపటినుంచీ నిలబడే ఉన్నారా, అలాకూర్చోండి" అని అక్కడే వాల్చి ఉన్న ఒక చిన్న మంచం చూపించింది

"ఏం, ఇంకా మాట్లాడే విషయాలున్నయ్యా అని ఆ మంచంమీద కూర్చో అనుమానం వేసింది ముందుకు ఒదిగిమంచపు పట్టెమీద కూర్చున్నా రెండునిముషాలలో మంచం తత్వం అంతా గ్రహించాను.

ఇంతలో మా బావమరిది శంకరం ఆ గదిలోకే వచ్చాడు "రావోయి కూర్చో" అంటూ ఆ మంచపుపట్టెమీద చేత్తో చరిచా.

నే అనటమే తడువుగా అతడు కూర్చున్నాడు ఏముంది నాకు జరగాల్సిన పని అతని కయింది ఆ మంచానికి నవారు లేదు పైన కేవలం దుప్పటి పరువబడియున్నది

పాపం, ఎల్లకింతలా పడ్డాడు అతనికి ఉక్రోషం, కోపం, అన్నీ కలసి వచ్చినాయి

కాని, నామీద మాత్రం కాదు వెంటనే ఇదంతా తన చెల్లెలిపనేనని గ్రహించుకున్నాడు

నెమ్మదిగా అక్కణ్ణుంచి జారిపోతున్న చెల్లెలి జడ పట్టుకొన్నాడు గబగబ నాలుగు చివాట్లు పెట్టాడు నే కనుక సర్ది చెప్పక పోతే రెండు దెబ్బలు గూడ వేసేవాడేమొ

అప్పట్నుంచి మా కొంటె మరదళ్లకు నేనంటే భయం నాకు దూరం దూరంగా ఉంటున్నారేగాని ఇలాంటి పరాచకాలు మరెప్పుడూ చేయలేదు

మరునాడు శ్రీవారితో మా వూరికి బండెక్కుతూ మా చిన్న మరదలు వంక చూచి "నా మీద కోపమా" అన్నట్లు ఒక చిరునవ్వు నవ్వాను

"కోపం దేనికి బావా?" అన్నట్లు తాను గూడ చిన్న చిరునవ్వు నవ్వింది.

ఆఁ చెప్పటం మరిచాను నాకు బడ్జెట్ లోపం రాలేదు మా మామగారు 20 రూపాయలు ఇచ్చారులెండి. ★

# జానపద చిత్రాలు - సాంఘిక చిత్రాలు

★

శ్రీ ఈ. వి. రావు

నేటి చలనచిత్ర పరిశ్రమలో జానపద చిత్రాలకూ, సాంఘిక చిత్రాలకూ పోటీ బాగా వుంది చదువుకున్న ప్రేక్షకులూ, సంస్కారం వున్న వాళ్లూ సాంఘిక చిత్రాలనే కోరుతున్నారు అయితే వాళ్లు జానపదచిత్రాలను చూడడం మానటం లేదు, జానపదచిత్రాలను చూసి విమర్శిస్తున్నారు చదువురానివారు, తమ భావాలను పత్రికలద్వారా తెలుపలేనివారు జానపదచిత్రాలనూ చూస్తున్నారు, సాంఘికాలనూ చూస్తున్నారు అయితే నిర్మాతలు జానపదచిత్రాలకు ఎక్కువగా డబ్బు రావడంవల్ల ప్రేక్షకులు వాటినే కోరుతున్నారనే భ్రమలో వున్నారు ఇటువంటి అభిప్రాయంతో వున్న నిర్మాతలకు యీ మధ్య వచ్చిన జీవితం, సంసారం చిత్రాలు ఎంత డబ్బు చేసుకున్నాయో బాగా బోధపరచినాయి

నిర్మాతలు చాలామంది డబ్బుకోసం, వాళ్ళ ఆనందంకోసం చిత్రాలు తీస్తారు గాని ప్రేక్షకులకోసం గాదు అయితే వాళ్ళకు సులువైన, యిష్టమొచ్చిన చిత్రాలు తీస్తూ యివి మీకోసమే, మీరు కోరిన చిత్రాలు యివే అని చెప్పే నిర్మాతలు చాలామంది వున్నారు

జానపద చిత్రాలకు డబ్బు బాగా వచ్చి సాంఘిక చిత్రాలకు రాకపోవటానికి చాలా కారణా లుంటాయి డబ్బు రానంత మాత్రాన సాంఘికచిత్రాలు మంచివి కావని మనం నిర్ణయించలేము డబ్బు వచ్చినంత మాత్రాన జానపదచిత్రాలు మంచివని మనం నిర్ణయించనూ లేం వ్యాపార రీత్యా డబ్బు రావడం రాకపోవడం నిర్మాతలు చూసుకోవలసిన విషయం ప్రేక్షకుడికి ఆ విషయంతో సంబంధం లేదు. అయితే సాంఘికాలు తీసి నిర్మాత దివాలా అయిపోవాలని ఏ ప్రేక్షకుడూ కోరడు సాంఘిక చిత్రాలు తీసే నిర్మాతలను జాగ్రత్తగా తియ్యమని మాత్రం హెచ్చరిస్తాడు

జెమినీవారి బాలనాగమ్మ బాగా సొమ్ము చేసుకున్నదగ్గరనుంచీ పురాణాలమీద



అశ్వనీవారి "మాయలమారి"లో నాగేశ్వరరావు, బాలసరస్వతి.

సాంఘిక చిత్రాలమీద వున్న నిర్మాతల దృష్టి జానపదచిత్రాలవైపు మళ్లింది కాని దీనినే చక్రపాణిగారు మరొకవిధంగా చెప్పుకొచ్చారు (8-11-50 తేదీ ఆంధ్ర వారపత్రిక) వారన్నదేమంటే - పురాణ గాథలు ప్రేక్షకు లందరికీ తెలిసినవే అవడంచేత, అవి బాగా తీసి ప్రేక్షకులను సంతృప్తిపరచలేకనూ పురాణ గాథలన్నీ యించుమించుగా యిదివరకే తెరకెక్కటం చేతనూ, చారిత్రాత్మక చిత్రాలు తియ్యడానికి డబ్బులేకనూ, సాంఘిక చిత్రాలు తీస్తే డబ్బురాకనూ, నిర్మాతలు జానపద చిత్రాలవైపు మళ్లారు - అని ఏది ఏమైనా జానపదచిత్రనిర్మాణం వెర్రితలలు వేస్తోంది

చక్రపాణిగారు పై మాటలను షావుకారు చిత్రం సొమ్ము చేసుకొని రోజుల్లోను, పాతాళభైరవి చిత్రం నిర్మించే రోజుల్లోను వ్రాశారు షావుకారు చిత్రం చాలా ప్రశంసలు పొందింది చిత్రంగా చాలా ఉన్నత స్థానాన్ని పొందింది కాని నిర్మాతలకు ఉత్సాహాన్నిచ్చేటంత డబ్బు సంపాదించలేకపోయింది సాంఘిక-చిత్రంగా షావుకారు డబ్బు తేలేకపోయిందిగాబట్టి జానపద-చిత్రాలన్నీ డబ్బు బాగా రాబట్టగలవనే నిర్ణయం సరియైనదికాదు ఈ మధ్య దెబ్బతిన్న జానపద-చిత్రాలనేకం వున్నాయి స్వప్నసుందరి, తిలోత్తమ, చంద్రవంక, ఆకాశరాజు, అగ్నిపరీక్ష మొదలైనవి ఈ చిత్రాల్లో చాలావాటికి సాంఘిక చిత్రాల తాకిడి బాగా తగిలింది సంసారం, నిర్దోషి చిత్రాలతో పోటీ చేయలేక పలాయనం చిత్తగించాయి

ఈ అనుభవంమీద మనకు తేలేదేమంటే సాంఘిక చిత్రాలయినంతమాత్రాన ప్రేక్షకులు ఆదరించరనీ, డబ్బురాదనీ నిర్మాతలు భయపడడం అనవసరం ప్రయత్నించి జాగ్రత్తగా, చక్కగా తీస్తే సాంఘిక చిత్రాలతో జానపదచిత్రాలు ఎన్నటికీ పోటీ చేయలేవు

చక్రపాణిగారు "మంచి జానపదచిత్రం కంటె పాడయిన సాంఘికచిత్రం మంచిదనే అపోహ బయలుదేరదీస్తున్నార"ని అన్నారు. ఈ వాక్యం చదివి నేను చాలా ఆశ్చర్యం చెందవలసివచ్చింది స్వర్గసీమ వంటి చిత్రానికి కథకులై, షావుకారువంటి ఉత్తమచిత్రాన్ని నిర్వహించిన చక్రపాణి వ్రాసిన వాక్యమేనా ఇది అనిపించింది ఏ ప్రేక్షకుడికీ, ఏ నిర్మాతకూ ఒక మంచి చిత్రాన్ని మరొక చెడ్డ-చిత్రంతో పోల్చే హక్కు లేదు అందులో అవి రెండూ వేరు వేరు తెగలకు చెందినప్పుడు అసలే లేదు ఒక మంచి జానపద చిత్రాన్ని, ఒక మంచి సాంఘికచిత్రాన్నిగాని లేక చెడిపోయిన సాంఘికచిత్రాన్నీ, చెడిపోయిన జానపద చిత్రాన్నీ తీసుకుని ప్రేక్షకుల అభిప్రాయాన్ని అర్థించవచ్చు అప్పుడు సాంఘిక చిత్రాన్నే ఎంచుకుంటారని నా నమ్మకం

మన తెలుగు చిత్రనిర్మాణచరిత్రలో వచ్చిన చిక్కేమిటంటే ముందుకు వెళ్లే నడక చప్పున ఆగి అంధకారంలోకి, అమాయకత్వంలోకి వెనక్కి నడుస్తోంది వందేమాతరం, సుమంగళి, గృహలక్ష్మి, మాలపిల్ల, రైతుబిడ్డ చిత్రాలతో ఉన్నత స్థాయిలోకి పోయిన తెలుగు చిత్రనిర్మాణం గొల్లభామ, మదాలస, కీలుగుఱ్ఱం, చంద్రవంకలవైపు తిరిగి వెర్రితలలు వేస్తోంది జానపద చిత్రాలవల్ల రెండే ప్రయోజనాలు కనిపిస్తున్నాయి ఒకటి - పాటకపుజనాన్ని స్త్రీలను అమాయకులుగానే వుంచి పాతివ్రత్యం, ప్రేమ, సహనం యిత్యాదులన్నీ బలవంతంగా, అసందర్భంగా, అనూహ్యంగా బోధించటం, రెండోది - విసుగు పుట్టించే కాలక్షేపాన్నివ్వడం అయితే సాంఘికచిత్రాల్లో అసందర్భాలు, అనూహ్యాలు అక్కడక్కడ లేకపోలేదుగాని, అవి జానపదచిత్రాలంత మరీ బొత్తిగా తలా తోకా లేని కథలు గావు

సాంఘిక-చిత్రాల్లో ఒక పాత్రను మరొక పాత్రగా భావించి అర్థం చేసుకోలేక తికమకలు పడిన అమాయక ప్రేక్షకులను చాలామంది తా నెరుగుదునని చక్రపాణిగారు వ్రాశారు అలా అయినట్లయితే మాయారంభ, తిలోత్తమ వంటి చిత్రాల్లో కథానాయకి, నాయకుడు డబుల్‌రోల్సు, త్రిబుల్‌రోల్సు నిర్వహించి జానపద చిత్రాలు ఏ ప్రేక్షకుడికోసం తీయబడుతున్నాయో అతన్ని మరీ గందరగోళ పరుస్తున్నాయి పైగా యీరోజుల్లో జానపద చిత్రాల్లో హీరోయిన్ల మేకప్ ఏ సాంఘిక చిత్రానికీ తీసిపోదు.

మన సారస్వతం, మన విజ్ఞానం అంతా పూర్వపు కథాసరిత్సాగరం, సింహాసన ద్వాత్రింశక మొదలైన ఇతిహాసాల నుంచే వెలువడిందనీ, అటువంటి మనం యీనాడు యీ జానపద చిత్రాలను గర్హించుకోవలసిన అవసరంలేదనీ యింకొక వాదనవుంది అయితే అవి గ్రంథాలుగా, ఇతిహాసాలుగానే పనికివస్తాయిగాని, సినిమా తీయడానికి పనికిరావు కాశీమజిలీలు చదువుకొని కాలక్షేపం చెయ్యటానికే పనికివస్తాయిగాని తెరమీదకు ఎక్కించవలసినంత గొప్పతనం, ప్రత్యేకత వాటిలో ఏమీ లేదు.

జానపదచిత్రాలు తీసినా, సాంఘిక చిత్రాలు తీసినా, నిర్మాతలు జాగ్రత్తపడకపోతే డబ్బురాదు ఒకే తరగతి ప్రేక్షకులను దృష్టిలో పెట్టుకుని తీసినా, అన్ని తరగతులనూ కాదని తమ ఆనందంకోసం తీసినా చిత్రాలు దెబ్బతినక మానవు జానపద చిత్రాల్లో కథలో సులువు, ఏవిధంగా కావలిస్తే ఆవిధంగా తిప్పటం, ఇక ఏదీ చాతకాకపోతే అమానుషశక్తుల్ని ప్రవేశపెట్టి పని జరిపించుకోవడం కనిపిస్తుంది సాంఘిక చిత్రాలకు కథావస్తువు చక్కనది ఎంచుకొని, నిర్వహణలో జాగ్రత్తపడితే సర్వజనానురంజకంగా చిత్రం తయారవడంలో సందేహం లేదు కథావస్తువు సహజత్వాన్ని పోగొట్టుకోకుండా వుండి, మానవజీవితాన్ని చక్కగా ప్రతిబింబింపచేస్తే సాంఘిక చిత్రాలతో ఏ చిత్రాలూ పోటీచేయలేవు జానపదచిత్రాల రోజులు అయిపోయినాయి మళ్లీ సాంఘికచిత్రాలు విజృంభించే రోజులు వస్తున్నాయి. ఈ కాలమార్పులో ఈ జానపదచిత్రాల సులువులూ, లాభాలూ రుచిచూచిన నిర్మాతలకు తమ స్థానాన్ని బలపరచుకోవడం కష్టంగానే వుంటుంది. ★

---

ఒక సినిమాతారని ఒకపత్రిక బాగా విమర్శించింది ఆమె డైరెక్టరుదగ్గిరికిపోయి, "చూశారా, ఆ పత్రిక ఏం రాసిందో. నాకు యాక్షన్ చేతకానే కాదట," అన్నది.

"ఆ పత్రికకి సొంత అభిప్రాయం అంటూ ఒక ఏడిసిందీ, ఓ విమర్శ అంటూ చాతవునా? అంతా అంటున్నమాటే అదీ అన్నది." అని సముదాయించాడు డైరెక్టరు.

# పులిగడ్డ

(11-వ పేజీ తరువాయి)

సుబ్బ: అరేయ్ నువ్వూరుకో అబద్ధం కాదు తాతా అదెక్కడి తెలివోగాని వింటిలో అంబు తొడుగుతుంటేనే కన్ను మరిగించి పోతుంది

తాత ఆఁహాఁ!

సుబ్బ నడసిన దారిన నడవదు పొయ్యిన బాటన పోదు మందు పెట్టిన మాంసం ముట్టదు దాని తస్సాదియ్యా వల పన్నితే తప్పుకు పోద్దంటె, దాని తెలివిని యేమను కోవాలి తాతా ఈ సంగతులన్నీ మీకు మాత్రం తెలియటంలా?

తాత తెలియకేం గాని, అందుకోసం ఊరొదిలి పోతారా?

మూడో ఈ పులి మన్ని నిలవనిచ్చేట్టు లేదు గా

తాత యీడ పులికి బయపడితే ఆడ దరిద్రమన్నది పెద్దపులాలె పట్టుకుంటుంది రెక్కలు విరుసుకుని అడివిని కొట్టి, చెమటోడ్చి సెలుము తవ్వి, బంగారం పండిస్తున్న యేటొడ్డు బూములు వొదులుకు పోతారా మాట్టాడరేం దయ్యా?

వీర ఇయ్యాల పులిని జూసి పారిపోతున్నారే, రే పెవుడయినా వొచ్చి, యిదంతా నాది, బయటికి నడవండంటే కూడా పోతారా?

మూడో మడిసికీ, పులికీపోలికేందమ్మా?

వీర మన బూములొంచి మన్ని తరమటంలోనే

మూడో మాటలు జెపుతావేం? పులి దుష్టజంతువుకదా!

తాత మడిసేనా తక్కువ? పులి ఆకలయి జనాన్ని సంపితే, మడిసి సరదాకోసం జనాన్ని సంపుతాడు గొప్పోడనిపించుకు నేందుకు మడుసుల్ని నరుకుతాడు బంగారంకోసం మడుసుల్ని మట్టిజేస్తాడు పులి దుష్టజంతువయితే మడిసి దుష్టన్నర దుష్టుడు

మూడో: యేం వుడయ్యా వాడూ! దమ్మను

తాత: ఇప్పుడు నోరులేని పులొస్తే నిలబడ్డావ్, రేపు—

మూడో నోరు లేని పులేంది? దాని నోటికి దడిసే ఇప్పుడు పొయ్యేది

తాత సంతోషించాంలే నీ తెలివికి ఇయ్యాల పులొస్తే—

మూడో ఇగుగో నీ యేదాంతాలతో మాకేంగానీ, మేమంతా యెల్తుండాం మీరుకూడా వస్తారా? మమ్మల్నే పొమ్మంటారా?

తాత సరే యీరమ్మా! అంతా పోతుంటే మనంమాత్రం యేంజేస్తాం మీ అత్తావాళ్ళని పిలు

వీర: లేదు తాతా! నా బొందిలో ఊపిరుండగా, ఈ వూరు వొదల్ను

తాత ఏం జేస్తావమ్మా?

వీర. కోటయ్‌మామా, నేనూ మీూ జేళ్ళకిందట యీడకి గంపెడంత ఆశతో వచ్చాం యిప్పుడు నేను గంపెడు సీకటి నెత్తి నేసుకుని బొయ్యేదా?

సుబ్బ అదిగాదమ్మాయ్! యీ పులుల పోడు వొచ్చుద్దని మనం కలగన్నామా?

వీర యేంజెపుతాక్ బాబాయ్, ఒక్క పులొస్తే, ఇల్లూ వాకిలీ వదిలి పరిగెత్తాలా?

మూడో ఒకటి గాదు నాలుగు పుల్లు

సుబ్బ నువ్వూరుకోరా, శకునపచ్చీ! అయితే యేందేస్తావంటావ్, అమ్మాయ్!

వీర కోటయ్‌మామ పులిమీదికి పోతూ, పులిగోళ్లు అబ్బాయి మెళ్లోకి తెస్తానని పొయ్యాడు, ఆయన్ని పులినోట బెట్టుకుంది యెట్టాగయినా సరే - దాని నెత్తురు కళ్ల జూసేదాకా, దాని గోళ్లు మా అబ్బాయ్ మెళ్ళో యేసేదాకా-నే నీవూరు ఇడవను.

తాత యీరుడులాగా చెప్పింది మా యీరమ్మ మీరంతా మొగాళ్లు కొదం[ట్రా]?

మూడో బల్ మొగాడు బయల్దేరాడయ్యా! ముసలాడు మూల కూసోక

తాత నీమొగసిరి యెలిగినట్టుందిలేరా, నమ్మినోడిని పులినోట బెట్టొచ్చావ్.

సుబ్బ ఆడితో యేందిగానీ, మనం యిప్పుడేం జేద్దామంటావ్ తాతా

తాత మనం అంతా మళ్లీ పులిమీద పోయి పడాలి

సుబ్బ ఇప్పుడు జనానికి అంత గుండెలు లేవ్ పులిపేరు జెపితేనే హడిలిపోతుం డాగు

తాత• అయితే దనదుపురంలో ఉన్న రాజుగారికి దండును బంపమని యిన్నపం చేసుకోవాల

సుబ్బ రాజిప్పుడు ఊళ్లో ఉన్నాడో, దచ్చినాదిమీదికి కయ్యానికి పోయ్యాడో!

తాత యెవుర్లో ఒకరు ఉంటారు ఆళ్లొచ్చేదాకా మనం ఊరిడవగూడదు అది చేస్తే తల గొట్టేసినట్టే

సుబ్బ అంతే నంటావా యీరమ్మా?

వీర పులయ్యేది, దయ్యమయ్యేదీ దాన్ని సంపి బూముల్ని సాగుచేసుకోవాలగాని, ఊరొదిలి మన పిల్లలకు చిప్పచేతికిస్తామా?

తాత ఆడదాన్ని సూసి నేర్చుకోండ్రా యెందుకు పిల్లల్ని కంటారు, కుసేలుడు కన్నట్టు.

సుబ్బ సరే తాతా. మేం యెనక్కి తిరుగుతాం

మూడో ఏమయినా అయ్యేదీ, నేను మాత్రం పొయ్యేదే

తాత: అయితే నువ్ దనదుపురానికే పో మీరంతా జాగర్తగా మసులుకోండి రేత్రిళ్లు మిద్దెలమీదనే పండుకోండి జాగర్తమీన ఉండండి

(కొంతవిరామం యీదురుగాలి వస్తున్న మోత)

వీర తాతా! యీ వడగాలికి మిద్దెమీన బండుకుంటే, పసిబిడ్డ దక్కుతాడా?

తాత అయ్యో! ఎట్టాగమ్మా?

వీర అన్నివిదాలా సావొచ్చింది తాతా! మిద్దెమీన బడుకుంటే, పసిబిడ్డ వడగాలికి బలవుతాడు లోన బండుకుంటే పులి యిద్దర్నీ మింగేస్తది

తాత మీ అత్తావాళ్లు ఏమన్నారమ్మా?

వీర యేమంటారూ, పైకిరమ్మన్నారు పైకిపోతే బిడ్డేం గావాలి? పెద్దపన్లోళ్లే వడదెబ్బకి పాణాలొదుల్తుండారు

తాత. కిందపడుకోటానికి తోడికోడళ్లూ, మరుదులూ తోడురారూ?

వీర ఆళ్లు తోడుగా దొచ్చేది. సత్తే నువ్ సావు గాని మేం రామన్నారు

తాత బయం లేదులే అమ్మా. నేనుంటాను తోడు

వీర• అయ్యో! నాకోసం నీపాణాలెందుకు బలిపెడతావ్ తాతా? ఎట్టా రాసిపెట్టి ఉందో అట్టా జరుగుద్ది

తాత అంత సిన్నపిల్లవి నీకే అంత నిబ్బరంవుంటే, కాటికి కాళ్లు జాచినవాణ్ణి, నాకేం దమ్మా! • గండ్ర గొడ్డలీ, బరిశా పక్కనే పెట్టు పిల్లోణ్ణి పడుకోబెట్టు

(స్వల్ప విరామం పులిఅరుపు కుక్కల ఏడుపు)

వీర (గుసగుస) అదుగోతాతా! పులొస్తుంది

తాత ('') అమ్మో! యీ సందే తిరుగుతున్నది

వీర ('') తలుపు పక్కనే గొడ్డలి పట్టుకుని నిలబడదాం

తాత ఉశ్! అరవబాక!

(దూరంగా పులిఅరుపు)

('') తాత అమ్మ! పులి పై కెళ్లిపోయింది

(దూరాన ఓ! అని పెద్దగా ఏడ్చిన కేక. జనం కేకలు)

వీర: ఏంది తాతా! ఎవర్నో పట్టేసిన ట్టుంది

తాత: ఉండుండు! జనం యాడవటం లేదే. ఎవర్నీ పట్టి ఉండదు. అదే జరిగితే ఏడుపు ఇనబడేదే!

వీర: మరి ఆ కేక?

తాత: మిద్దెమీదికి ఎగిరిందే ననుకుని ఎవరో అరిచి ఉంటారు

(దూరంగా పులిఅరుపు)

తాత: అమ్మ! పులి పై కెళ్లిపోయింది ఇంక గండం తప్పినట్టే. అదుగో మూడో జాము కోడికూడ కూస్తాంది... అహ్! రామా! రామ!

(ఆవలింత)

వీర: తాతా! నీకు నిద్ర మోపయిన ట్టుంది. కాసేపు పండుకో. నే కనిబెట్టి ఉంటాలే.

తాత ఒద్దమ్మ!

వీర కాదులే! పు ళెళ్లిపోయిందిగా?

తాత. సరే నీయిష్టం (తాతనురక)

(స్వల్పకాల విరామం)

వీర: (గుసగుస) అమ్మ! ఈరేత్రి గడిస్తే దేవుడి దయ (ఆవులింత)

(బరబర ఏదో బరికిన చప్పుడు)

వీర: అరె! ఆఁ! యేం దది

(ఒక్కసారిగా కుక్కల ఏడుపు. జనం కేకలు. బరబర బరికే చప్పుడు)

వీర: అయ్యొ! పు లొచ్చినట్టుంది. పాపం తాతమాత్రం ఏం జేస్తాడు. నిలబడ సత్తువ లేదు. అయ్యొ! మట్టిగోడ తవ్వుతుందే యెట్టా కానియ్ ఈడ మట్టిరాల్తున్న కాడ గొడ్డలిదీసుకుని నిలబడతా పైన బగవంతుడే ఉన్నాడు. ఆఁ. అదుగదుగో కంత! ఆ! తలబెట్టింది.

(గొడ్డలి మెత్తటి వస్తువుమీద పడ్డమోత ఊరు దద్దరిల్లేట్లు పులిఅరుపు పెద్దగా వీరమ్మకేక పిల్లాడి ఏడుపు)

తాత: యేం దది? యీరమ్మా! అరె పడిపోయిందేం? యాడది ఈ నెత్తురు.. ఆఁ! పులి! ఓరి నాయినో! అరే తల బద్దలయింది సీదీ దెబ్బ! యీరమ్మ పేరు నిలబెట్టుకుంది ఓయ్! రాండయ్యా! పులి సచ్చిపోయింది.

దూరాన జనం కేక: ఎవరది? తాతా!

తాత: ఆఁ! ఆఁ!! నేనే! పులి సచ్చిపోయింది యీరమ్మ దాని తల బద్దలు జేసింది కిందికి దిగండి బయం లేదు

(జనం వచ్చిన శబ్దం అరెరె! అని ఆశ్చర్యం తెలిపే కేకలు)

తాత: మీలో ఒకళ్లు మిద్దెమీద యీరమ్మ చుట్టాలని పిలవండి. పిల్ల తెలివి తప్పి పడిపోయింది.

2 వ గొంతు: యేం జరిగింది తాతా!

తాత. కనబట్టంలా?

సుబ్బ: కన్నం దవ్వినట్టుందే!

తాత అవును అదే దీనికి సావు దెచ్చిపెట్టింది.

సుబ్బ: యెట్టాగయినా యీరమ్మ యీరమ్మే!

తాతా నిబ్బరంగా ఉంటే మడిసిని పులేం జేస్తది?

జనం అవును, నిజమే

తాత అవునయ్యా! గుండె లున్న వాళ్లని పులేం జేస్తుంది పదండి. పులిగడ్డమీదికి ఆడకూతురు యీరమ్మ ఒక్క సేత్తో యేసు గంతె పులిని జంపితే, యింతమంది మొగాళ్లు నాలుగు పులుల్ని సంపలేరా?

జనం యెందుకు సంపలేం పదండి పులిగడ్డమీదికి. పదండి! పదండి తూరుపు తెల్లార్తుంది.

(పులిగడ్డమీదికి పదండి-అని కేకలు. జనం కోలాహలం.)





నేషనల్ హాకీ చాంపియన్ షిప్పు పోటీలు గెలిచిన పంజాబుజట్టు.

కథానిక

# కోపకారణం

**'కొత్తవాడు'**

"కలకలలాడుచు, కిలకిల నవ్వుచు, కలికీ నాతో పలుకవేలనే" సాయంత్రం అయిదు గంటలకు యింటి గుమ్మం మెట్లెక్కాడు రామ్మూర్తి కూని రాగం తీస్తూ ఎంత ఆనందంగా ఉన్నాడు తనీరోజు, కాదూమరి గుమస్తాల బ్రతుకంతటికీ వెన్నెల ఫస్టు తారీఖేగా కాని వాళ్ళ దురదృష్టంవల్ల, ఆ వెన్నెల ఆట్టే రోజులు కాయదు పదోతారీఖుకే వారికి కృష్ణపక్షం ప్రవేశిస్తుంది నెలలో ఆఖరి వారంరోజులూ అమావాస్య, వాళ్ల నిత్యజీవితంలో వెధవ గుమస్తాగిరీ ఉదయం ఆరుగంటలకల్లా నిద్రలేవాలి *Time* తప్పకుండా ఏడుగంటలకల్లా ఆఫీసు చేరుకుని 11 గం దాకా పని చేసి, యింటికి వచ్చి రెండు మెతుకులు నోట కొట్టుకుని మళ్లీ ఆఫీసుకిపోయి సాయంత్రం అయిదింటిదాకా బల్ల ముందు కూచొని రికార్డు అనే మహాసముద్రంలో మునిగిపోవాలి ఇంతలో అయిదుగంటలవుతుంది 'బ్రతుకు జీవుడా' అని తీరా లేవబోయేసరికి 'అక్కౌంటు కరస్పాండెన్సు' అంటూ క్రొత్తరికార్డు తీసికొచ్చి బల్లమీద పడేస్తాడు బిళ్లబంట్రోతు 'చచ్చానురా భగవంతుడా' అనుకుంటూ మళ్లీ కుర్చీలో కూలబడి ఆ రికార్డుకూడ ఎలాగో పూర్తి చేసి, మేనేజరు బల్లదగ్గరకు తీసికెళ్లితే ఆయన రాజరీవితో పేజీలు తిరగవేస్తూ 'యిదిగో యిక్కడ కామా పెట్టు యిక్కడ *underline* చెయ్యి డ్రాఫ్టు చెయ్యటమే తెలియదేం' అంటూ రిమార్కు చేస్తుంటే, ఎంత ఓపికగలవాడికైనా ఒళ్లు యిట్టే దహించుకుపోతుంది అక్కడికి తనే జీతం ఇచ్చి నౌకరీ చేయించుకుంటూన్నట్టు

పాపం సావిత్రికి తనంటే ఎంతో ప్రేమ కనుకనే గుట్టుగా యింతవరకూ యీడ్చుకొచ్చింది గాని, అదే యింకొక ఆడది అయితే తనభర్తని, సంసారాన్ని విడిచి యెక్కడికైనా పారిపోయేది తనకు మటుకూ యిష్టంలేదూ దానిని సుఖపెడదామని? కథల్లో చదువుకొన్న రాజకుమార్తెలా, అప్సరసల్లా తన సావిత్రిని పూలల్లో పెట్టి లాలిస్తూ, ఆమెతో చెట్టా పట్టాలు పట్టుకొని అమరలోకాలకు ఎగిరిపోదామని ఎన్నికలలు కనలేదు తను? ఏం చేస్తాడు అప్పులవాళ్లు ఫస్టుతారీఖు రాంగానే యింటి గుమ్మంవద్ద తిష్ఠవేసి తమకు రావలసింది ఖచ్చితంగా అడిగి తీసికెళ్లుతారు పాల వెంకమ్మకు రెండునెల డబ్బు యివ్వాలి ఇంటియెదుటి కట్టెలడిపో వెంకయ్యనాయుడికి పదిరూపాయలు బాకీ కూరలమ్మి పినకు రెండురూపాయలు దిగబడిపోయినయ్యని ప్రతినెలా గునుస్తుంటుంది ఇవన్నీ పోగా క్రొత్తనెలకు బియ్యం మొదలైనవి కొనాలి ఇక మిగిలేదేమీ లేదు

అప్పుడనుకున్నాడు రామ్మూర్తి తనీ గుమాస్తా వుద్యోగంలో ప్రవేశించడంకంటె నీచమయిన పని మరొకటి లేదని బాల్యచరిత్ర అంతా జ్ఞాపకం వచ్చింది ఆ రోజుల్లో తన క్లాసుపిల్లలు తనని యెంత గౌరవించేవారు! హైస్కూలులో ఫస్టుమార్కులన్నీ తనకే వచ్చేవి తన పరీక్షపేపర్లు యింటికివచ్చిన పెద్దమనుష్యులకు చూపి నాన్న యెంత మురిసిపొయ్యేవాడు! స్కూలుఫైనలు పరీక్షలో తన స్కూలులో మొదటివాడుగ ప్యాసయినప్పుడు, పార్కరుపెన్ను బహుమతిగా యిస్తూ 'కాలేజీలో కూడ మంచిమార్కులు తెచ్చుకుని నీ హైస్కూలు పేరు నిలుపు' అన్న హెడ్మాష్టరు మాటలు తన చెవుల్లో యింకా ప్రతిధ్వనిస్తున్నయి విజయోత్సాహంతో అప్పుడు ఎంత వుప్పొంగిపోయాడు! సాయంత్రంపూట పొలంగట్టులమీద నడుస్తూ యెప్పుడు సెలవులు అయిపోతయ్యా, యెప్పుడు కాలేజి తెరుస్తారా అని యెంత ఉవ్విళ్లూరాడు! నాన్న గూడ 'యెలాగైనా నిన్ను కాలేజీలో చేర్పిస్తానురా' అని వుత్సాహపరచేవాడు కాని తానొకటి తలుస్తే, దైవమింకొకటి తలచింది అతని విషయంలో అనుకోకుండా నాన్న హఠాత్తుగాపోయాడు తన ఆస్తి అంతా అప్పులపాలవుతుందని కలలో కూడా అనుకోలేదు అప్పుడేకదూ, యిక యే గత్యంతరం లేక గుమాస్తా వుద్యోగంలో ప్రవేశించాడు తనతో స్కూలుఫైనలు చదివి నాలుగుసార్లు తప్పిపోయిన శంకరం బట్టల మేనేజరయ్యి, తను గుమాస్తా వుద్యోగంకోసం మొఱపెట్టుకుంటే నాలుగుసార్లు చుట్టూ త్రిప్పుకుని చివరకు ఖాళీ లేదని చప్పరించాడు? ఆ నాలుగేళ్ల నుంచీ ఆ తొంభైరాళ్లతోటే సంసారం వెళ్ళదీస్తున్నాడు పిల్లాజెల్లా యెవరూ లేకపోయారు గనుక సరిపోయింది గాని లేకపోతేనా అమ్మో! తన అవస్థ ఆ భగవంతుడికే యెఱుక 'ఓయి భగవంతుడా! నాకు పిల్లల్నియ్యనందుకు నీకు జోహార్లు' అని మళ్ళీ ప్రార్థించుకున్నాడు

"కొంచెం మంచినీళ్లు తీసుకురా సావిత్రీ" అని కోటువిప్పుతూ కేకేశాడు రామ్మూర్తి జవాబురాలేదు లోపల్నించి యింకొంచెం గట్టిగా పిల్చాడు బూట్లు విప్పుతూ తలయెత్తి చూచేసరికి మంచినీళ్ల గ్లాసు అక్కడ పెట్టి వుంది పనిలోవుంది కాబోలనుకొని రామ్మూర్తి చొక్కావిప్పి వంకెకి తగిలించి జేబులోంచి నోట్లుతీసి జాగ్రత్తగా లెక్కపెట్టాడు తొంభై రూపాయలూ సరిగ్గా వున్నయి డబ్బు చేతికందిందిగదా అనే సంతోషం, యెక్కువసేపు నిలవదనే విచారం హృదయాన్ని కలచినవి నోట్లు అలమారులో పెట్టి, గ్లాసులోని మంచినీళ్ళు త్రాగాడు లోపలకు వెళ్లాడు 'సుబ్బిశెట్టి వుదయం వచ్చాడా' 'నాకు తెలీదు' అని ముభావంగా సమాధానమిచ్చింది, పొయ్యివైపు తిరిగివున్న సావిత్రి ఆశ్చర్యం వేసింది రామ్మూర్తికి రోజూ తను ఆఫీసు నుండి యింటికి వచ్చేటప్పటికి, ఎదురు వచ్చి, ఎంతో సంతోషంతో పలకరించి "అబ్బ! మీరు లేంది, ఇంట్లో ఒక్కత్తెనూ ఏమీ తోచదండీ" అంటూ సంబరపడే సావిత్రి యివేళ గ్లాసు చేతికందించకుండా క్రింద పెట్టిపోయింది ఎందుచేత? యిప్పుడు ఇట్లా సమాధానమిస్తుందెందుకు

"వెంకయ్యనాయుడు వస్తే పదిరూపాయలు యిచ్చేయి. సుబ్బిశెట్టికీ, కూరలమ్మకీ కూడా బాకీలు తీర్చేయి డబ్బు అలమారాలో పెట్టాను" అని పరధ్యాన్నంగా స్నానాల గదిలోకి వెళ్లాడు తుండుగుడ్డ పైనవేసుకుని స్నానంచేస్తూ సబ్బుబిళ్ళ యేదని గట్టిగా పిలిచాడు 'యెందు కట్టా అఱచు కొంటారు' అని సణుక్కుంటూ తెచ్చిపెట్టింది 'కొస్త వీపు రుద్దు' 'అవతల గిన్నె మాడిపోతోం'దని దరచరా యింట్లోకి పోయింది యెందుకని సావిత్రి, యెన్నడూ లేంది, యివాళ అలా వుంది? సావిత్రి ముభావంగా గ్లాసు తనముందు పెట్టినప్పుడామెకు కోపం వచ్చిందని తను మొదట గ్రహించలేదు తర్వాత ఆమె ఒక్కొక్క చేష్ట చూస్తుంటే నిజంగానే కోపం వచ్చినట్లుంది రోజూ తను స్నానం చేస్తున్నప్పుడు వద్దన్నా వీపురుద్దే సావిత్రి, యీనాడు పిలచినా వినిపించుకోకుండా వెళ్లింది ఒకవేళ తను సరోజతో స్నేహంగా వుంటున్నానని అనుమానిం

లేదుగదా! తనకూ, సరోజకూ మధ్య స్నేహంకంటే మరే యితరవిధమైన సంబంధమూ లేదని ఆమెకు తెలుసునే రోజూ ఆఫీసునుంచి ఆలస్యంగా వస్తున్నాడని కోపం వచ్చివుంటుందా? యింకా యితర కారణాలు తెలీనివేమైనా వున్నయ్యా అక! "సబ్బుపూసుకున్న ముఖం కడుక్కోకుండానే ఆలోచిస్తున్నాడు 'గంటసేపైనా స్నానాలు తెమలవు తోడిపెట్టేవాళ్లుంటే సరీ యెన్ని నీళ్లయినా పోసుకునేందుకు' అని కేకలు వేస్తోంది సావిత్రి గబగబా వొంటిమీద నీళ్లు కుమ్మరించుకున్నాడు!!! అవును మరి - అదిమటుకు మనిషికాదూ, ఆడదై పుట్టినంతమాత్రాన అడ్డమైన చాకిరీ చేసి, మొగుడిచేత తిట్లూ, తన్నులూ తింటూ కుమిలిపోవలసిందేనా? దానికి మటుకు తనవలె స్వేచ్ఛగా తిరగాలనే కోరిక లేదూ పురుషుని ప్రేమిస్తుందిగాని అతడు నిర్లక్ష్యంచేస్తే సహించగలదా, స్త్రీ? భర్తయే దేవుడని భావించి, వండినకూరంతా అతనికే పెట్టి, వద్దంటూన్నా దగ్గర కూచోని, లాలించి, తినిపించి, చివరకు తనకు యేమీ మిగలకపోయినా, పాతగోంగూరపచ్చడితో తృప్తిపడే సావిత్రిమీదనా తను అధికారం చెలాయించడం, తనేమైనా ఆమెమీద దాక్షిణ్యం చూపిస్తూన్నాడూ?

'కూర యింకా కొంచెం వడ్డించు! ఆప్యాయంగా అడిగాడు ఆలోచనా ప్రపంచంనుంచి విస్తరిముందుకు అవతరించిన రామ్మూర్తి 'లేదు' భోజనం అయింతర్వాత మజ్జిగ కావాలన్నాడు 'అయిపోయినయి' అని జవాబు రామ్మూర్తి మాట్లాడకుండా చెయ్యి కడుక్కొని యింట్లోకివెళ్ళాడు మంచంమీద కూచోని సావిత్రి మునపటిమాదిరిగ చిలకలు చుట్టి యివ్వలేదు తనే కొంచం వక్క నోట్లో వేసుకొని పక్కమీద శరీరాన్ని వాల్చాడు పూర్వకథఅంతా కలగా జ్ఞాపకం వచ్చింది రామ్మూర్తికి తనొక రాజకుమారుడట ఒకనాడు వేటకు వెళ్లి, యింటికి తిరిగివచ్చేటప్పటికి రాణీ హత్యచేయబడి ఉందట ఇంకా యేమేమో పాడుకలలు రామ్మూర్తి మనస్సు కలవరపెట్టినయి చటుక్కున లేచి కూచున్నాడు మంచంమీద ప్రక్కలో సావిత్రి లేదు అసలు యింకా పని ముగించుకుని రానట్టు తోచింది రామ్మూర్తికి!!

పదకొండు గంటలు కొట్టారు తాలూకాఫీసులో రామ్మూర్తికి అనుమానం వేసింది సావిత్రి ఇంతవరకూ ఏం చేస్తున్నట్టూ? వంటయింట్లోకి వెళ్లాడు అక్కడ లాంతర వుందిగాని సావిత్రి కనపడలేదు!!! గుండెల్లో వేలకొలదీ రైళ్ళు పరుగెత్తినయి రామ్మూర్తికి సావిత్రి తనను విడిచి యెక్కడకు వెళ్ళింది లాంతరు తీసికొని దొడ్లోకి వెళ్లాడు

దొడ్లో మసకచీకటిగావుంది భావిలోకి తొంగిచూశాడు ఏమీ కనుపించలేదు అక్కడే కూలబడ్డాడు ఉబికివచ్చే కన్నీళ్లు బలవంతాన ఆపుకుంటూ సన్నని రోదన స్వరం వినిపించిందతనికి ఒకమూలనుంచి హృదయంలో ఆశాభావం తలెత్తింది. ఆ స్వరం వినిపించినవైపు వెళ్లాడు ఇంకేవరు! తన సావిత్రే! క్షేమంగా వుంది అమ్మయ్య! అనుకున్నాడు మంచంలో కూచుని మోకాళ్లపై తలమోపి వెక్కి వెక్కి యేడుస్తోంది సావిత్రి భుజంమీద చేతులు వేసి తల నిమురుతూ "యెందుకో చెప్పవూ. ఇవాళల్లా యెందుకిట్లా వున్నావు నాతో దాపరికం దేనికి?"

"ఏం లేదు" అని సన్నగా జవాబు.

"వంట్లో సరిగ్గాలేదా?"

"బాగానే వుంది"

"మీవాళ్ల దగ్గరనుంచి యేమైనా వార్త వొచ్చిందా? అంతా కులాసాగా వున్నారా?"

"ఊఁ"

"సుబ్బమ్మపిన్ని, కోడలుకేమైనా నగలు చేయించి పెట్టిందా?"

"అబ్బ! పోదురూ, అక్కడికి నగలు చేయించి పెట్టమని పోరుతున్నట్లు మిమ్మల్ని"

"మరెందుకు దిగులు? పిల్లలు లేరనా? భగవంతుడు చల్లగా చూస్తే, రేపు మనింట్లో కూడ దిగుతుందో దుర్యోధనసంతతి!"

"చాల్లే వూరుకుందురూ, మీకంతా మరీ యెగతాళి!" చిలునవ్వుముత్యాలు ఒలకబోసింది సిగ్గదొంతర్ల సందుల్లో!!

"మరి దేనికిలా వున్నావు! తన అవ్యక్తతకు ఆశ్చర్యపోయినాడు రామ్మూర్తి.

"అదే"

"అంటే?"

"మొదటాట సినిమాకు ఒక్కసారన్నా తీసుకుపోయారూ!" అని అంగలార్చింది సావిత్రి మెత్తని చేతులతో తన భర్త చెక్కిళ్లు నిమురుతూ ★



భార్య. అదేమిటండీ, ఇందాక మనింటికొచ్చి నావిడ, నే మాట్టాడుతున్నంతసేపూ ఆవులిస్తూనే వుంది

భర్త. బహుశా ఏదో చెప్పబోయి నోరు తెరుస్తూవుందేమో.

* * * *

"నాజుట్టు ఊరికే రాలిపోతోందోయ్, ఏం చెయ్యమంటావ్?"

"కొంచెం పక్కగా నుంచో, మీద పడకుండా"




పాతపాట

# చందమామ

సేకరణ శ్రీ బులుసు వి. జి. కృష్ణ

చందమామ చందమామ
ఓ చందమామ
చందమామ కూతురూ
నీలగిరి కన్యా!
నీలగిరి కన్యకూ
నిత్యమల్లెతోట;
తోటలో నున్నాది
చలువరాతి కోట;
కోటలో నున్నాది
రత్నాల పీట;
ఆ పీట మీదుంది
ముత్యాల మూట;
ఆ మూట నాకిస్తె మాదొడ్డమాట.




## 11

టామ్ తల్లి పడుకుని ఆలోచించసాగింది. ఆలోచించిన కొద్దీ ఆమెకు కొడుకును గూర్చి దుఃఖం ఎక్కువైంది. నెమ్మదిగా ఆమె మనస్సులోకి అర్థంకాని అనుమానమేదో ప్రవేశించింది. పిచ్చి సంగతి అటుంచి ఈ కుర్రవాడిలో టామ్‌లో లేని కొత్తలక్షణం కనిపిస్తోంది. ఆ లక్షణమేమిటో మాత్రం స్ఫురించటం లేదు. అది ఫలానా అని చెప్పటానికి సాధ్యంకావటం లేదు. అయినా ఆమె మాతృహృదయానికి ఈ కొత్తదనం బాణంలా గుచ్చుకుని బాధపెడుతోంది. ఒకవేళ ఈకుర్రవాడు తన కొడుకు కాడేమో?... ఆః, వట్టిమాట. తనకొడుకు కాకపోతే ఇంకెవరు అతడు? ఈ భావం కలిగినందుకు ఆమెలో ఆమెకే నవ్వు వచ్చింది అంత దుఃఖంలో కూడా.

అయితే ఎంత ప్రయత్నించినా ఈ భావం తొలగిపోవటం లేదు. అతడు తన కొడుకు కాడేమోనన్న అనుమానం పెనుభూతంలా ఆమెని తరిమింది, ఆమె మనస్సుని చెయ్యిపెట్టి కెలికినట్టు కెలికింది; పురుగులా దొలిచింది, ఎంత తోసివేసినా మళ్లీ మళ్ళీ మనస్సుపై వాలింది. ఇక ఈ సమస్యని అటో ఇటో తేల్చుకోకపోతే మనస్సుకు శాంతి ఉండదని పించింది. ఇందుకేమిటి ఉపాయం? ఏ పరీక్ష పెడితే తేలుతుంది ఈ విషయం? తీవ్రంగా ఆలోచించింది ఆ పేదరాలు. ఎన్నో ఉపాయాలు ఆలోచించింది ఏదీ సరియైన సాధనంగా తోచలేదు. తిరుగులేని ఉపాయం కావాలి ఉత్తూ. లాభం లేదు. అతడు తన కుమారుడేనని నిర్ధారించే పరీక్ష ఏమీ లేదు.

ఇంతలో ఆమెకు కుర్రవాని మృదువైన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వినిపించాయి. క్రమం తప్పకుండా ఒకేలయలో గాలి పీలుస్తూ వదులుతున్నాడు. అంటే మంచి నిద్రలో ఉన్నాడన్నమాట.

అనువాదం.
శ్రీ
నండూరి రామమోహనరావు

ఈ లయబద్ధమైన ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో ఉండి ఉండి వినిపిస్తోం దొక మూలుగు. గొంతుక ఎవరో నొక్కి వేస్తున్నట్టు పీడకల వచ్చి నప్పుడు కష్టంమీద వెలువడే ఏడ్పు పులా వుంది ఆ మూలుగు.

వెంటనే ఆమెకు చక్కటి ఉపాయ మొకటి తోచింది ఒక రోజున టామ్‌కాంటీ ఏదో ఉత్సవం సందర్భంలో టపాకాయ పేలు స్తున్నాడు. అది అకస్మాత్తుగా అతని ముఖంమీద పేలింది అత డప్పుడు తీవ్రంగా భయపడి కళ్ళకు చెయ్యి అడ్డం పెట్టకున్నాడు అయితే అందరిమాదిరిగా అరచెయ్యి లోపలి వేపుకి పెట్టకోలేదు అరచెయ్యి బయటికి తిప్పి అడ్డంపెట్టుకున్నాడు ఆ రోజునుంచీ అతని కిదే అలవాటై పోయింది హఠాత్తుగా, ఉలిక్కిపడి నప్పుడల్లా అరచెయ్యి వెలుపలికి తిప్పి కళ్ళ కడ్డం పెట్టుకుంటాడు ఈ అలవాటును టామ్ తల్లి వందల సార్లు గమనించింది. ఇది ఆమె కిప్పుడు జ్ఞాపకం వచ్చింది

ఆమె చకచకా తన ప్రయత్నం ప్రారంభించింది సద్దుకాకుండా లేచి కొవ్వొత్తి వెలిగించింది నెమ్మ దిగా యువరాజు పక్క వద్దకు పాకి వెళ్ళింది దీపానికి చెయ్యి అడ్డంపెట్టి అతని చెవిపక్కన చప్పుడు చేసింది. అతడు కళ్ళు తెరిచే క్షణానికే కొవ్వొ త్తిని కళ్ళ ఎదట ఝుళిపించింది యువ రాజు ఉలికిపడి లేచాడు కాని విల క్షణమైన చేష్ట ఏమీ చెయ్యలేదు.

పాపం ఆ పేదరాలుకు ఆశ్చ ర్యం, దుఃఖం రెండూ ముంచుకు వచ్చాయి అయితే ఆమె ఏమీ ఎరగనట్టు అతన్ని మళ్ళీ నిద్ర పుచ్చింది తన పరీక్ష ఇలా వ్యర్థ మైనందుకు ఆమెకు దాదాపు మతి పోయినంత పని అయింది ఒకవేళ టామ్‌కు పిచ్చెక్కడం వల్ల పాత అలవాటు మర్చిపోయాడేమోనని ఆలోచించింది కాని, అబ్బే! ఆ అలవాటును మాన్పటం దేవుడి తరం కాదు. అతని మనస్సుకు పిచ్చెక్కి వుండవచ్చు, కాని అతని చేతులికి పిచ్చెక్కదు. ఎన్నో ఏళ్ల నుంచీ బలంగా పట్టుకొని వున్న ఆ అలవాటు ఇంత కొద్దికాలంలో నశించదు దీనికి ఆమె ఇదివరకు అనేక నిదర్శనాలు చూసివుంది కూడా

తన పరీక్ష వ్యర్థమైనప్పటికీ ఆమెకు అతనిమీద ఆశ పోలేదు. ఇందాక అనుమానం ఎంత బలంగా ఆమెని పీడించిందో ఇప్పుడు ఆశ అంత దృఢంగా ఆమె మనస్సును హత్తుకుంది. అందుచేత ఆమె మళ్ళీ లేచి ఇందాకటివలెనే యువరాజును అకస్మాత్తుగా నిద్రలేపి వెలుతురు చూపింది రెండోసారి అలాగే అయింది మూడోసారి ప్రయత్నిం చింది అప్పుడూ అంతే అయింది. ఇక తన ప్రయత్నం విరమించుకుని పక్కపై మేను వాల్చింది

"నా చిట్టి తండ్రి కాక ఇంకెవ రితడు? తప్పక నావాడే. నావాడు కాదని ఎల్లా తోసెయ్యగలను?" అని లోపలే వెక్కి వెక్కి ఏడుస్తూ పడి నిద్రపోయింది

యువరాజు ఆ రోజున అనుభ వించిన బాధలవల్లా, దెబ్బలవల్లా అలిసి అలిసి ఉన్నాడు అందుచేత అతనికి బాగా గాఢంగా నిద్ర



మీదికివచ్చే జనంతో పోరాడుతున్న యువరాజు, మైల్స్ హె…న

పట్టింది గంట తరవాత గంట గడుస్తోంది, అతడు మాత్రము ఒళ్లెరగకని దిస్తున్నాడు కొంతసేపటికి మత్తు తగ్గింది; సగం నిద్ర, సగం మెలకువలో ఉన్నాడు. పలవరింతలు ప్రారంభమైనాయి.

"సర్ విలియమ్!"

మరి కాసేపాగాక

"హాో, సర్ విలియమ్ హెర్బర్ట్ ఇలా రా, నా కొక తమాషా కల వచ్చింది, వింటావా?. . సర్ విలియమ్! ఏయ్ నిన్నే మనిషీ! నేను బిచ్చగా ణ్ణయిపోయినట్టు కల వచ్చింది. ...ఎవరక్కడా?అంతా ఎక్కడికి పోయారు?".

"ఏమిటి తమ్ముడూ, కలవరిస్తున్నావా? ఎలా వుందిఒంట్లో?" అని ఒక మెల్లని కంఠం అతనికి అస్పష్టంగా వినిపించింది

"సర్ విలియమ్ హెర్బర్ట్! ఎవరు నువ్వు?"

"నేనా? ఎవరినేమిటి? నీ అక్కని; ఇంకా నీకు మతిరాలేదూ, అయ్యో పాపం, ఎంత అవస్థ వచ్చిందిరా తమ్ముడూ నీకు. కాని అరవబోకమ్మా, నాన్న లేస్తే అందర్నీ వళ్లీ బాదేస్తాడు," అన్నది నాన్.

యువరాజు భయపడి హఠాత్తుగా లేచికూర్చున్నాడు, వళ్లంతా పచ్చి పుళ్లుగా వుంది. వెంటనే తన పరిస్థితి అంతా గుర్తుకొచ్చింది, చుట్టూ చూసి మళ్లీ వెనక్కి వాలిపోయి మూలిగాడు:

"ఇది కల కాదన్నమాట."

నిద్రలో మరిచిపోయిన బాధ, విచారం అన్నీ మళ్లీ అతన్ని ముట్టడించాయి అందరి దగ్గరా గారాబంగా ముద్దులు గుడుస్తూ, మహాప్రభువుల గౌరవ నమస్కారాలు అందుకుంటూ రాజభవనంలో విహరించే యువరాజు కాదు తను. ఇప్పుడు తనొక బిచ్చగాడు, కుక్కలకు, పందులకు తగిన కొంపలో దీనుడై, నిస్సహాయుడై మూలుగుతున్నాడు.

తనలో తను ఇల్లా ఆలోచించుకుంటున్నా, అతనికి ఇంటిబైట నుంచి ఏవో కేకలు, కోలాహలం వినిపిస్తూనే వున్నాయి. ఇంతలో ఎవరో తలుపు మీద తీవ్రంగా తట్టారు. జాన్ కాంటీ గుర్రు ఆపేసి

"ఎవ రా తలుపు తట్టేది? ఏం కావాలి?" అని గదమాయించాడు.

ఒక గొంతుక సమాధానమిచ్చింది

"రాత్రి నువ్వు కర్రతో కొట్టిం దెవర్నో తెలుసా?"

"తెలియదు. తెలుసుకోవల్సిన అవసరంకూడా లేదు," అని అహంకారం ఉట్టిపడేట్టు అన్నాడు కాంటీ.

"సర్లే. నీ మిడిసిపాటు త్వరలోనే తేలిపోతుంది. నీ తలకాయ మీద ప్రేమ ఏమన్నా వుంటే నువ్వు కాలికి బుద్ధి చెప్పటమే మార్గం. ఆ మనిషి చచ్చిపోయాడు. అతడు ఎవరో అనుకుంటున్నావేమో, ఫాదర్ ఆండ్రూ."

"అరె బాప్. చచ్చానిక. ఇప్పుడేం చెయ్యాలి," అని కాంటీ గబగబ మంచం దిగి అందర్నీ లేపాడు: "లేవండి, ముండల్లారా! పారిపోవాలి వెంటనే, లేకపోతే ప్రాణాలు దక్కవు, ఊఁ, త్వరగా."

మరి అయిదు నిమిషాల్లో కాంటీ కుటుంబం యావత్తు, సామాన్లనెత్తికెత్తుకుని వీధుల్లో పడి పారిపోతున్నారు. జాన్ కాంటీ యువరాజు చెయ్యి దృఢంగా పట్టుకున్నాడు, చీకట్లో బరబర యీడ్చుకు పోతున్నాడు

"ఒరే పిచ్చివెధవా! నోరెత్తావంటే మక్కె లిరగతంతాను. నీ పిచ్చివాగుడు కాస్సేపు మర్చిపో. మన పేర్లు బయట పెట్టకు. నీకొక కొత్తపేరు పెడతాను, ఎవరన్నా అడిగితే అదే చెప్పు. ఏం అర్థమైందా?" అని బోధించాడు యువరాజుకు మిగతావాళ్లకిలా చెప్పాడు' "మనం విడిపోవల్సివస్తే మళ్ళీ లండను వంతెన మీద కలుసుకుందాం. వంతెన మీద ఆఖరి బట్టలదుకాణం వుందే, అదీ మన చోటు. అంతా కలుసుకున్నాక యీకంగా సౌత్ వార్కు (లండన్ సివారు) లోకి పోదాం"

ఇంతలోవారు చీకట్లోంచి హఠాత్తుగా వెలుగులోకి వచ్చారు వెలుగులోకే కాదు జనసమూహంలోకి కూడాను వందలకొలదీ జనం తాగి తందనాలు తొక్కుతున్నారు, పాటలు, అరుపులు, ఒకటేమిటి ఆ ప్రాంతమంతా హోరెత్తిపోతోంది. థేమ్సునదిపొడుగునా నెగళ్లు మిన్నంటేటట్టు మండుతున్నాయి. లండన్ వంతెన, సౌత్ వార్కు వంతెన ప్రాంతాలు దీపాల తోరణాలలో ప్రకాశిస్తున్నాయి. నది పైన రంగు రంగుల దీపకాంతులు ప్రతిఫలించి ఆదృశ్యం కన్నుల పండువుగావుంది నిమిష నిమిషానికి ఔట్లు

మొదలైన బాణాసంచా గూబలు పగిలేట్టు శబ్దంచేస్తూ పేల్తున్నాయి. అది పట్టపగలుమాదిరి వుంది గాని రాత్రిలా లేదు.

ఈ జనకోలాహలాన్ని చూడ గానే జాన్ కాంటీ బూతుల పంచాంగం విప్పాడు. వెనక్కి తిరగ మని తనవాళ్ల నాజ్ఞాపించాడు. కాని అప్పటికే ఆలస్యమై పోయింది. జనం వాళ్లని చుట్టుముట్టారు. వెనక్కి గాని ముందుకి గాని పోయే సందు లేదు. మరొక నిమిషంలో కాంటీ కుటుంబం ఒకళ్ల కొకళ్లు దూరమై పోయారు. జాన్ కాంటీ యువ రాజును మాత్రం వదల్లేదు కాని ఈ గందరగోళంలో తప్పించుకు పారిపోయే అవకాశా లున్నట్టు యువరాజుకు తోచింది. సమయం కోసం చూస్తున్నాడు.

కాంటీ జనాన్ని అటు ఇటూ నెట్టుకుంటూ దోవ చేసుకు పోవ టానికి ప్రయత్నిస్తున్నాడు ఆ నెట్ట డంలో కాంటీ ఒక మనిషిమీద తూలాడు. ఆ మనిషి చిత్తుగా తాగి వున్నాడు, వాణ్ణిచూస్తే సారాపీపా, పిప్పళ్లబస్తా మొదలైన వస్తువులు జ్ఞాపకం వస్తాయి అతడు గదలాంటి తనచెయ్యి కాంటీ బుజంమీద వేసి ఉపుతూ,

"ఏంటి నేస్తం! అంత దూకుడు మీాదున్నావ్? అంతా పండగ జేసు కుంటుంటే నువ్వొక్కడివీ ఏంటో పనిమీాద పోతుండావే? ఆగు, కాసంత నిదానించు," అని నిలే శాడు.

"చెయి తియ్. నాగొడవ నాది. ఆర్చేవాడివా,తీర్చేవాడివా నువ్వు? ఎహె, చెయ్యితియ్యమంటుంటే, నన్ను పోనియ్," అన్నాడు కాంటీ మొరటుగా.

"ఓ, జోరుగా మాట్టాడుతుం డావే. నిన్ను కదలనివ్వను. వేల్సు యువరాజులుంగారి పేరుచెప్పి సారా తాగందే, అడుగే శ్వేవో, ఇహ జాస్తో," అని ఆ వ్యక్తి చేతులు బారజాపి అడ్డంగా నుంచున్నాడు

"అయితే కూజా తీసుకురా తొందరగా"

అప్పటికే మిగతాజనం వీళ్ల చుట్టూ గుమిగూడారు, చిత్తుగా తాగి మత్తెక్కి కాళ్ళమీాద నిలబడ లేకపోతున్నారు, వాళ్లిలా అరి చారు:

"కూజా, సారాకూజా తీసుకు రండెహె! ఈ డెవడో మాగీరగా ఉండాడు కుత్తుకదాకా తాగిద్దాం. తాక్కపోతే చేతులు, కాళ్లు కట్టేసి నదిలో పారేద్దాం"

పెద్ద సారాకూజా తీసుకురాబడింది ఇందాకటి లావాటి వ్యక్తి దాన్ని కాంటీకి అందించాడు.

ఉత్సవసమయాల్లో ఇలా అంతా కలిసి ఒకే కూజాలోంచి సారా తాగటం ఇంగ్లీషువాళ్లలో ఎన్ని వందల ఏళ్ళనుంచో వస్తున్న సంప్రదాయం. ఆ కూజాని 'ప్రేమ కూజా' అంటారు. అందులోంచి సారా తాగుతూ "నిన్ను ప్రేమిస్తున్నాను," అని ఒకళ్ళొకళ్లు అనుకోవాలి. కూజా అందించినప్పుడు దాన్ని ఒక చేత్తో అందుకుని, రెండోచేత్తో మూతతీసి మరీ తాగాలి, అది వాళ్ళ ఆచారం.

జాన్ కాంటీ ఒక చేత్తో ప్రేమ కూజా, నంది పుచ్చుకుని రెండో చేత్తో మూత తీశాడు. అంటే యువ రాజును విడిచిపెట్టాడన్నమాట. చెయ్యివిడిచీ విడవగానే యువరాజు క్షణం వృథాచెయ్యకుండా అందర్నీ తోసుకుని గబగబ పరిగెత్తాడు. మరుక్షణంలో జాన్ కాంటీ ఎటు చూసినా కనిపించనంత దూరానికి వచ్చేశాడు.

ఇక తను చెయ్యవలసిం దేమిటో స్పష్టంగా నిర్ణయించుకున్నాడు యువరాజు వేల్సు యువరాజుకు లండన్‌నగరపౌరులు ఇవాళ విందు చేస్తున్నారు. ఈ సంగతి ఇందాక తాగుబోతుల ప్రేలాపనలో బయట పడింది తను ఇక్కడ వుండగా వేల్సు యువరాజుకు విందు జరగట మేమిటి? కనక ఆ బిచ్చగాళ్ల కుర్రాడు టామ్ తను లేని అవ కాశంచూసుకుని తనే యువరాజుగా చెలామణీ అవుతున్నాడన్న మాట. పాపంగదాఅని ఆదరించినందుకు ఆ టామ్ ఎంత ద్రోహం తలపెట్టాడు? తను యువరాజు కాదని, అసలు యువరాజును వెదకండని తెలప నక్కర్లా?

కనుక చెయ్యవలసిం దేమిటంటే —విందు జరుగుతున్న 'గిల్డ్‌హాల్'కు పోవాలి అక్కడ తనే యువ రాజునని చెప్పి టామ్‌ని పట్టుకు శిక్షించాలి అతన్ని కొంతకాలం పశ్చాత్తాపం పొందనివ్వాలి. తర వాత న్యాయశాసనప్రకారం ఉరి తీసి, వీధుల్లో శవాన్ని ఈడ్పించి, ముక్కలు చేసి కాకులకు గద్దలకు వెయ్యాలి. అంతే, మరో మార్గం లేదు.

## 12

యువరాజు వేషంలో టామ్ కాంటీ కోటఈవలకు రావటం మనం చూశాం. తనకోసం సిద్ధపరచబడిన 'రాజనౌక' నెక్కి అతడు బయల్దేరాడు గిల్డ్‌హాల్ (పురమందిరం)వైపు అతని నౌకను అనుసరించి ప్రభువుల,ఇతర అధికారుల నౌకలు వస్తున్నాయి. థేమ్సునదిలో అటూఇటూ బారులు తీర్చి నిలబడ్డాయి కొన్ని వందల నౌకలు. ప్రతిదానిలోనూ రంగుల దీపాలు వెలుగుతున్నాయి. బ్యాండు మేళాలతోనూ, ఫిరంగుల మోతలతోనూ వాతావరణమంతా బరువెక్కింది ఒడ్డుల నిలబడిన ప్రజాసమూహాలు టామ్ కనిపించగానే టోపీలు తీసేసి. జయజయ ధ్వానులతో స్వాగతం ఇస్తున్నారు.

నౌకలోని సిల్కుసోఫాలో సగం మునిగి కూర్చుని దిక్కులు చూస్తున్న టామ్‌కాంటీ తనకు జరుగుతున్న ఈ అపూర్వ గౌరవం ఎంత విస్మయంపొందాడో చెప్పలేం. అతని పక్కన సోఫాల్లో ఠీవిగా కూర్చున్న యువరాణి ఎలిజబెత్‌కూ, జేన్‌గ్రేకూ ఈ గౌరవాలు, స్వాగతాలూ ఓ లెక్కలోకే రాలేదు.

నిర్మలమైన సరస్సులో మెల్లిగా, సోమరిగా ఈదుతున్న రాజహంసలాగా, 'రాజ నౌక' అలా ఒయ్యారంగా పోయి పోయి, ఆగవలసిన రేవులో ఆగింది, టామ్ నౌక దిగాడు పరివారసమేతంగా కొంతదూరం నడిచాడు చీప్‌సైడ్ బజారు దాటి బేసింగ్‌హాల్ వీధి గుండా గిల్డు హాల్ చేరుకున్నాడు.

గిల్డ్‌హాల్ ప్రాకార ద్వారంవద్ద లండన్ నగరపు మేయరు, మునిసిపాలిటీ సభ్యులూ సిద్ధంగా వున్నారు. వారు టామ్‌ను, ఇద్దరు బాలికలనూ గౌరవపూర్వకంగా ఆహ్వానించారు. వారు పొడుగ్గా కాళ్లవరకూ వేలాడే వదులైన ఎర్రటి దుస్తులు ధరించి డాబుగావున్నారు మన బాల అతిథులను హాలు బయట ఆవరణలో వేసిన చాందినీలోకి తీసుకుపోయ్యారు

అంతా ఎవళ్ల స్థానాల్లో వాళ్లు కూర్చున్నారు. విందుసమయంలో టామ్‌కు అందుబాటులో ఉండవలసిన ప్రభువులు, వారి భార్యలు అతని కుర్చీ వెనక కుర్చీల్లో వరసన కూర్చున్నారు మిగతా ప్రభువులు, మునిసిపాలిటీ సభ్యులు కొంత దూరంలో వేరే బల్లలవద్ద కూర్చున్నారు ఇంకా తక్కువతరగతికి చెందిన అధికారులు, చిన్న ఉద్యోగులు హాల్లో వేయబడిన బల్లలవద్ద కూర్చున్నారు ఇంతలో బాకాలు ఊదబడినాయి, విందుఏర్పాట్లకు అధికారియైన ఒక లావాటి గుండ్రటి వ్యక్తి (ఇతన్ని బట్లరు అంటారు) ప్రవేశించాడు బట్లరు వెనక అతని సేవకులు మాంసపు పళ్లెం పట్టుకుని ప్రవేశించారు మాంసం వేడివేడిగా పొగలు గక్కుతూ ఘుమ ఘుమా యిస్తోంది.

భోజనానికి ముందు జరిగే దైవప్రార్థన ముగిశాక టామ్ (ఏమేం చెయ్యాలో అతనికి ముందే పాఠం నేర్పబడ్డది) గంభీరంగా లేచాడు. అతనితో మిగతా అతిథులూ యావన్మందీ నిశ్శబ్దంగా లేచారు. అందమైన బంగారు 'ప్రేమకూజా' అంది పుచ్చుకుని ఒక గుక్క ద్రాక్షరసం తాగాడు. అది అంది పుచ్చుకుని యువరాణి ఎలిజబెత్ తాగింది. తరవాత జేన్‌గ్రే తాగింది. 'ప్రేమకూజా' ఈవిధంగా చేతినుంచిచేతికి, బల్లనుంచి బల్లకూ తిరిగింది. తరవాత విందు ప్రారంభమైంది.

ఆ రోజు అర్ధరాత్రయ్యేసరికి ఉత్సవకోలాహలం మిన్నుముట్టింది. ప్రభువులు, వారి భార్యలు, మేయరు, మునిసిపాలిటీ అధికార్లు, ఇంకా తదితర గొప్ప గొప్ప అతిథులు చిత్తుగా,పూటుగా, కంఠందాకా తాగేశారు. అక్కణ్ణించి ప్రారంభించారు నృత్యం.ఆడవాళ్లు మొగవాళ్లు కలిసి చెట్టాపట్టాలేసుకుని గిల్డుహాలు నృత్యమందిరంలో చిందులు త్రొక్కారు. ధగద్ధగాయమానమైన దీపకాంతుల్లో, రకరకాల, రంగురంగుల, వెలలేని వస్త్రాలతో, ఆభరణాలతో, అలంకారాలతో వారు శివమెత్తినట్టు ఆ రాత్రల్లా నృత్యం చేస్తూనే వున్నారు. జన్మలో కనివిని ఎరగని ఈ దృశ్యం టామ్ చూసి తన్మయుడైపోయాడు తన ఉన్నత సింహాసనంమీద నోరుతెరుచు క్కూర్చుని. కాని అతనిపక్కన కూర్చున్న ఎలిజబెత్, జేన్‌గ్రేలు ఇలాంటి దృశ్యాలు ఎన్ని చూశారో, కించిత్తయినా చలించలేదు.

అయితే ఏ యువరాజు గౌరవార్థమైతే లండన్‌ప్రజలు ఈ ఉత్సవం జరుపుతున్నారో ఆ అసలు యువరాజు ఎడ్వర్డు ట్యూడర్ ఆ సమయంలో, గిల్డుహాలు ప్రాకారం

బయట చిరుగ్గుడ్డ లేసుకుని వాదిస్తున్నాడు అతని చుట్టూ సోమరిపోతు జనం పోగడ్డారు. అతడు ఎత్తైన ఒక రాతిమీద కెక్కి ఉపన్యాసం దంచేస్తున్నాడు. పిడికిళ్లు బిగించి ఊగిస్తూ ఊగుతూ, తనే అసలు యువరాజునని చెప్పాడు, తనకు తీరని అన్యాయం, అవమానం జరిగిందన్నాడు, తన హక్కులు తనకి తిరిగి ఇమ్మన్నాడు, తన స్థానంలో దర్జాగా కూచ్చుని, కులుకుతున్న ద్రోహిని ఖండించాడు ఈ 'నాటకం' అంతా చూసి జనం చాలా ఆనందించారు, అతన్ని దగ్గిర్నించి చూడాలని ఒకళ్ల నొకళ్లు తోసుకున్నారు. చివరికి అతన్ని వెక్కిరించడం వేళాకోళమాడ్డం సాగించారు. వాళ్లు ఏడిపిస్తున్న కొద్ది యువరాజుకు ఉడుకుమోత్తనం ఎక్కువైంది ఇంకా బలంగా గర్జించాడు తన హక్కులు తన కిమ్మని అతనికి తెలియకుండానే కన్నీళ్ల ప్రవాహంతో అతని చెక్కిళ్లు, బటలు తడిసిపోయాయి, అయినా అతడు జంకూ గొంకూ లేకుండా రాజ రీవితో జనాన్ని ఎదిరించాడు' బెదిరించాడు !

"మళ్ళీ చెబుతున్నాను, కుక్కల్లారా! పందుల్లారా! నేను యువరాజుని. నన్ను మీరెంత వెక్కిరించినాసరే, నా కెవ్వరూ ఈ ఆపదలో సహాయం చెయ్యకపోయినా సరే, నే నిక్కణ్ణించి కదలను. నేను వేల్సుయువరాజును, వేల్సు యువరాజును, వేల్సుయువరాజును.

"నువ్వు యువరాజువైనా కాకపోయినా నీకేం భయంలేదు మైల్స్ హెండన్ నీపక్కన నిలబడినంత కాలం నీమీద ఈగైనా వాలదు. నీ ధైర్య సాహసాలు అద్భుతంగా వున్నాయి నా మాట నమ్ము, నేను నీస్నేహితుణ్ణి."

ఈ మాటలన్న మనిషివంక అందరూ విచిత్రంగా చూశారు అతని వేషం, నడకతీరు, మాటతీరు చూస్తే ఒక వీరుడిలాగా, జల్సా పురుషుడిలాగా వున్నాడు. అక్కడున్న అందరికంటె పొడుగ్గా, అందంగా, కండలు తిరిగి వున్నాడు. అతని వస్త్రాలు ఖరీదైనవే కాని బాగా మాసి, దుమ్ము కొట్టుకొని వున్నాయి. టోపీ, అందులోనికుచ్చు నలిగి, రంగుమాసి వున్నాయి బెల్టులోంచి తుప్పపట్టిన ఒర, అందులో పొడుగాటి ఖడ్గం వేలాడుతున్నాయి. ప్రపంచంలో ఎవణ్ణీ లెఖ్ఖ, జమా చెయ్యనట్టు, గర్వంతో కూడిన చిరునవ్వు ఆ యువకుని పెదవులపై నాట్యం చేస్తోంది

ఈకొత్తవ్యక్తిని చూడగానే అందరూ వేళాకోళం ప్రారంభించారు

"వీడెవడు? ఇంకో యువరాజా?

"అరేయ్ గట్టిగాఅనకురా ఆమాట. ప్రమాదకరంగా వున్నాడుమనిషి "

"వీడూ యువరాజేరా, వాడి మొహం చూడరాదూ?"

"ఆ కుర్రాణ్ణి పట్టుకున్నా డేంవాడు? వాళ్లిద్దర్నీ విడదీయండి ఇద్దర్నీ బందిలిదొడ్డికి తోలుకుపోదాం "

జనం ఇలా అరుచుకుంటూ కొత్త వ్యక్తినీ, యువరాజునూ సమీపించి చుట్టుముట్టారు. ఒకడు యువరాజు మీద చెయ్యి వేసి లాగబోయాడు కూడా.

మరుక్షణంలో కొత్తవ్యక్తి ఒరలోంచి కత్తిదూశాడు. యువరాజు మీద చెయ్యి వేసినవాణ్ణి కత్తితో ఒక్కతోపు తోశాడు. ఆ తోపుకు వాడూ, వాడివెనక ముగ్గురూ ఒకళ్లపై ఒకళ్లు తూలిపడ్డారు.

వెంటనే ఒకవంద గొంతికలు, "ఆ కుక్కవెధవని చంపండి. చంపండి. చంపండి," అని అరిచాయి. జనం ఇంకా దగ్గిరికి వచ్చారు. మన యోధుడు ఒక చేత్తో యువరాజును పట్టుకొని మరొక చేత్తో కత్తి తిప్పుతూ దగ్గర కొస్తున్న వాళ్లని దూరానికి తరమసాగాడు. యువరాజుకూడా అక్కడ దొరికిన ఒక కర్ర నందిపుచ్చుకుని మీదికి వచ్చే జనంతో యుద్ధం చెయ్యసాగాడు. అయినా జనం ఆగలేదు. ఇద్దరు ఎంతసేపని వాళ్లతో పోరాడగలరు? ఇద్దరూ ఇంకపట్టు బడి పోయేటట్టున్నారు జనప్రవాహం కోపోద్రేకంతో నదిమీదికి తోసు కొస్తున్నది.

కాని ఇంతలో బాకాలు వినిపించాయి "రాజదూతకు దారి ఇవ్వండి," అని హెచ్చరిక వినబడింది. గుర్రాలపై కొందరు రాజభటులు జనంమీదికి తోసుకువచ్చారు గుర్రాల తొక్కులాటకు, రాజభటుల లాఠీదెబ్బలకు నిలవలేక జనం ఎక్కడివాళ్లక్కడ చెల్లాచెదరై పోయారు. రాజభటులు నేరుగాగిల్డుహాలులోపలికిపోయారు. ఇదేసమయమని, కొత్త వ్యక్తి యువరాజును ఎత్తుకుని పరుగు తీశాడు జనంలేని వైపు

(ఇంకావుంది)





# బెంగుళూరు ప్రయాణం

శ్రీ అయ్యగారి శ్రీరామచంద్రమూర్తి

అవి, మా బాబాయ్ బెంగుళూరులో టికట్ కలక్టరు ఉద్యోగం చేసే రోజులు. నేను రాజమండ్రీలో చదువుకుంటూ వుండేవాణ్ణి మా నాన్న అమ్మ చెపుతూవుంటే వినడమేగాని, నేను ఇంతకు ముందెప్పుడూ మా బాబాయ్‌ని చూడలేదు. ఆ సంవత్సరం పరీక్షలయిపోయాయి. సెలవలిచ్చారు. రాజమండ్రీలో ఎండలు విస్తారంగా వుండడం వల్ల ఆ వేసంగి కాస్తా బెంగుళూరులో గడుపుదామనుకున్నాను.

మా నాన్నగారి అనుమతికూడా పొంది, మర్నాడు తెల్లవారగట్ల మూడుగంటలబండీకి బయలుదేరదామని నిశ్చయించుకుని, అలారంపెట్టి, సరిగ్గా రెండున్నరకు లేచి కూర్చున్నాను. పెట్టె బేడా బయటపెట్టి, రిక్షాలేమైనా దొరుకుతయ్యేమోనని వీధిలోకి వచ్చి చూశాను. పేరుకైనా ఒక్క రిక్షా కూడా లేదు. "చచ్చాంరా దేముడా" అనుకుని, నా పెట్టే, బెడ్డింగూ, మా నాన్నగారి సైకిలుమీద పెట్టి, నేను వెనకాల పట్టుకుని నడుస్తూవుంటే మానాన్నగారు సైకిలు నడిపిస్తున్నారు. ఇంతలో సైకిలు ఒక చిన్న రాయిమీద కెక్కి జారింది. నేను అసలే ప్రయాణంగురించి ఆలోచిస్తూ పరాకుగా వున్నానేమో, నా పెట్టె బెడ్డింగూ "దభేలు"మని క్రింద పడ్డాయి. నా మందబుద్ధితనానికి నన్ను నేనే తిట్టుకుని, అవి రెండూ తీసి మళ్ళా సైకిలు వెనకాలపెట్టి, ఈ మారు కాస్తగట్టిగా పట్టుకుని చచ్చి చెడి చాయంగల విన్నపములు అన్నట్లు, నెమ్మదిగా స్టేషనుకు చేరాం.

తీరా చేస్తే బండి అరగంట లేటు అన్నారు నేను సామాన్లు ప్లాటుఫారం బల్లమీద పెట్టి, బెజవాడకు ఒక అరటిక్కట్టు కొనుక్కున్నాను. (నా ప్రోగ్రాంలో పుయ్యూరులో దిగాలని వుంది లెండి.) తీరా బయటకొచ్చేటప్పటికి రైలు గుప్పుమని పొగలు జిమ్ముతూ వచ్చేసింది. వెధవరైలు అప్పుడే వచ్చేసిందేమిటా అని మనస్సులో అనుకుని, మూడోతరగతి పెట్టె వెదకి కటికీకి దగ్గరగా చోటు చూసుకుని కూర్చున్నాను. తర్వాత మా నాన్నగారు ఇంటికి వెళ్ళిపోయారు.

రైలు కదిలింది నేను బెంగుళూరు

గురించి ఆలోచిస్తూ కూచున్నాను. చాలా స్టేషన్లు ఒక మాటు మొహం చూపించి వెళ్ళిపోయాయి. తర్వాత నిడదవోలు స్టేషను వచ్చింది. నాకు ప్రొద్దున్నే కాఫీ త్రాగే అలవాటుంది లెండి. అందుకని, నేను రైలు దిగి, మొహం కడుక్కుని (అప్పటికి తెల్లవారింది లెండి) కాఫీ త్రాగడానికి వెళ్లాను. అక్కడ ముందు డబ్బులిస్తేగాని కాఫీ ఇవ్వడుట. అందుచేత కాఫీకిడబ్బులు ఇచ్చి, ఒక కప్పు తీసుకుని, సగంవరకూ తాగేశాను. ఇంతట్లో ఇంజను కూత కూసింది "ఓరి బాబో" రైలు కదిలిపోతుంది కామోసు ననుకుని ఆ కాఫీ అక్కడ వదిలేసి, నే నెక్కిన పెట్టెదగ్గిరకి పరుగెత్తి, నాచోటులో నేను కూర్చున్నాను. ఎంతసేపటికీ రైలు కదలలేదు. ప్రక్కనున్న మొగాయన్నడుగుతే, "ఇంజను నీళ్ళ కెళ్లినట్టుంది" అన్నాడు ఆ మాటవిని, నేను రైలు దిగి, పరుగెత్తుకుని వెళ్ళి ఇందాక వదిలిన కాఫీకోసం చూతునుగదా, ఆ సెర్వరుగాడు అప్పుడే కప్పు కడిగేశాడు మళ్ళీ డబ్బులిచ్చి, ఇంకో అరకప్పుకాఫీతీసుకుని, స్థిమితంగా త్రాగి రైలెక్కాను.

దానికేమొచ్చిందో, బెజవాడవచ్చేటప్పటికి చీకటి పడింది నేను రైలు దిగి బెడ్డింగు చంకనా, పెట్టె చేతా పట్టుకుని, బస్సుస్టాండుకి వెళ్ళి, వుయ్యూరుపోయే బస్సుఎక్కి, నెమ్మదిగా రాత్రి తొమ్మిదింటికి వుయ్యూరు జేరుకున్నాను అక్కడ మా చిన్నాన్నగారున్నారులెండి, మీకు తెలీదు. ఆయనింటి కెళ్లేటప్పటికి ఆయన నిద్రావస్థలో వున్నారు. ఆయన్ని లేపి, సామాను లోపల పెట్టి, కాస్సేపు ఆకబుర్లు, ఈకబుర్లు చెప్పుకున్నాం. పదయ్యేసరికి పడుకుని, తెల్లవారే లేచి, కాలకృత్యములను తీర్చుకొని ఆ వూరు పంచదార ఫ్యాక్టరీని చూడాలని ఫ్యాక్టరీ దగ్గరకు వెళ్ళి, చూడ్డానికి అనుమతి సంపాదించాం. అబ్బ! చాలా పెద్ద ఫ్యాక్టరీ అదిచూస్తూవున్నంతసేపూ నాకు కల్గిన ఆనందం అపరిమితం. ఇటువంటి ఫ్యాక్టరీలు వుండికూడా ప్రభుత్వం పంచదారకు రేషను ఎందుకుపెట్టిందోకదా ననిపించింది. అంతాచూసి, ఇంటికివచ్చాం.

మళ్లీ తెల్లవారగట్ల మొదటి బస్సుకు వెళ్లిపోవాలని నిశ్చయించుకుని, గడియారం తలదగ్గర పెట్టుకుని నిద్రించాను. నా ప్రయాణానికి మా చిన్నాన్నకూడా ఏవిధమైన అభ్యంతరమూ చెప్పలేదు. అలారం కొట్టింది. గభాల్న లేచి, బెడ్డింగూ, పెట్టె మోసుకొని బస్సుస్టాండుకు వెళ్లాను. అక్కడ అప్పుడే మొదటి బస్సు నిలిచి వుంది. నా సామాన్లు లోపల పెట్టి, నేను ఎక్కికూర్చుని, జేబు తడుముకోగా, పర్సు తేలేదని జ్ఞాపకం వచ్చింది బస్సు ఇంకా ఎంతసేపాగుతుందని కండక్టరు నడిగితే ఇంకా పదినిముషాలాగుతుందన్నాడు. నేను బస్సుదిగి ఇంటికి పరుగెత్తి, పర్సు తెచ్చుకుని, వచ్చేలోపలనే సామాను పెట్టిన బస్సు కాస్తా బర్రుమని బయల్దేరి వెళ్లిపోయింది. బస్సుని అందుకోవాలని పరుగెత్తేను కాని అందలేదు.

బయల్దేరిన వేళా విశేషమనుకుని, ఏం చెయ్యాలో తోచక తచ్చాడుతూ వుంటే రెండో బస్సువచ్చి ఆగింది. బెజవాడ బస్టాండులో మొదటిబస్సు వుంటే నా సామాను దొరుకుతుంది లేకపోతే లేదని దేవుడిమీదే భారంవేసి, బస్సులో కూలబడ్డాను. బర్రుబర్రుమని డ్రైవరు బస్సు స్టార్టుచేశాడు. సగందూరం సజావుగానే వచ్చింది. ఆపైన ఒక అరగంట మకాంవేసి, తెల్లవారేక 8 గం॥కు బెజవాడ జేరింది. పూర్తిగా ఆగకుండానే దిగి, అక్కడేవున్న మొదటిబస్సులో నా సామాను చెక్కుచెదరకుండా వుండడం చూసి, అపరిమితానంద భరితుణ్ణయి, ఆ సామాను తీసుకుని, రిక్షాలో స్టేషనుకు వచ్చి అరటికెట్ కొనుక్కొని, ప్లాటుఫారం మీద కొచ్చాను.

అలవాటు ప్రకారం కాఫీ సేవించి, కూర్చున్నాను ఎక్స్‌ప్రెస్ వస్తోందని ముందుగానే తెల్సుకుని, సామానుపట్టుకొని నిలబడ్డాను. నిజంగానే వచ్చింది. నేను ఒక మూడవతరగతి పెట్టెలో ఒకమూల కొంత స్థానాన్ని ఆక్రమించి, ఇంక రైలు దిగకూడదని నిశ్చయించుకున్నాను. సాయంత్రం 7 గంటలయ్యేసరికి మదరాసు వచ్చింది. రైలుదిగి, బెంగుళూరు పోయే మెయిల్ ఏ ప్లాట్ ఫారానికి వస్తుందో కనుక్కొని, అక్కడికి వెళ్ళి, రైలుబండీకోసం ఎదురుచూస్తూ కూర్చున్నా. అదీ వేంచేసింది. నేను వీలైనంత తొందరగా ఎక్కి బెర్తుమీద ప్రక్కపరచి నిద్రించాను జాలార్ పేట స్టేషను

(-42వ పేజీ చూడండి)




బాలలూ! పిల్లులు ఆహారంతిన్న తరువాత వాటిమూతిని కాళ్ళతోను, నాలుకతోను తుడుచుకోవటం మీరు చూచే ఉంటారు అవి అలా ఎందుకు చేస్తాయో మీకు తెలుసా? దానికో చక్కని కథఉంది. వింటారా!

ఒకనాడో పిల్లికి చాలా ఆకలి వేసింది. దాని కెక్కడా ఆహారం దొరకలేదు. పెక్కిండ్లకు పోయింది. అక్కడా, ఇక్కడా వెదకింది. ఎక్కిన గుమ్మం, దిగిన గుమ్మం. కాని ఎక్కడా ఏమీ దొరకలేదు. చాలా అలసిపోయింది. పాపం! దానితోపాటు ఆకలికూడా హెచ్చయింది. ఇంతలో అదృష్టవశాత్తు దానికో ఎలుక దొరికింది. ఆ పిల్లి దాన్ని తన కాళ్ళక్రింద అదిమిపెట్టి చంపి తినేద్దామనుకుంటోంది

ఎలుక మాత్రం ఏమీ భయపడలేదు. ఎంతో ధైర్యంగా ఉంది. అది పిల్లితో అంది గదా "నీకే విధమైన అపకారం నే చేయలేదుగదా! నన్నెందుకిలా చంపుతావు? నన్ను వదిలేయి బాబూ! అని.

"నిన్ను వదిలేయాలా? నువ్వు వెళ్ళిపోతావేం? అది ఎంతమాత్రం లాభంలేదు. నాకు చాలా ఆకలిగా ఉంది వెంటనే తినేస్తా"నంది పిల్లి.

అపుడా ఎలుకకు ఏం చేయాలో తోచలేదు. ప్రాణాలు పోయాయే అనుకుంది. చివరకు దానికో ఆలోచన తట్టింది. అపుడంది ఆ ఎలుక "ఓ పిల్లిబావా! నీకు ఆకలిగాఉంటే నన్ను తప్పకుండా చంపి తినెయ్యి. అందుకేమీ విచారించను నేను. కాని నువ్వు పూర్వాచారం ఏమీ పాటించటం లేదని నాకు చాలా కించగా ఉంది" అని.

పిల్లి ఆశ్చర్యంతో "ఏమిటా పూర్వాచారం?" అని అడిగింది.

"ఆహారం తినేముందు మూతిని శుభ్రం చేసికోవాలనేనా నీకు తెలీదా, పిల్లిబావా!" అంది ఎలుక.

పిల్లి వెంటనే తన కాళ్ళతోను, నాలుకతోను తన మూతిని తుడుచుకోబోయింది. ఇంతలో ఎలుక బయటపడి "సెలవాండి. పిల్లి బావగారూ!" అని తన కలుగులోకి దూరిపోయింది "అమ్మో! దొంగ ఎలుకా! ఇదా నీ ఎత్తు" అంది ఆపిల్లి "ఈఎలుక నన్ను వెక్కిరించి పోయింది. కాని నేనిపుడో పాఠాన్ని నేర్చుకున్నాను. నేనింకెప్పుడూ ముందుగా మూతి తుడుచుకోను. ఆహారం తిన్న తరువాతనే మూతిని శుభ్రంగా తుడుచుకుంటాను" అని నిశ్చయించుకుంది అప్పట్నుంచీ పిల్లులు ఆ ఆచారం అమలులో పెట్టేయి.






అనగ అనగ ఒక ఊళ్లో ఘంటయ్య, చెంచయ్య అనే ఇద్దరన్నదమ్ములున్నారు. ఒకడంటే మరొకడికి అయిష్టం. అందుచేత ఇద్దరూ చెరో ఇంట్లోనూ ఉంటున్నారు. ఘంటయ్యకు లేక లేక ఒక కుమారుడు కలిగాడు కొడుకుపుట్టిన ఏడాది తిరగకుండా ఘంటయ్య భార్య చనిపోయింది. ఘంటయ్యే పాపం ఆ కుర్రాణ్ణి సీతయ్యఅనే పేరెట్టి నాలుగేళ్ళవరకు పెంచాడు

పాపం! ఘంటయ్యకు క్షయ రోగం వచ్చింది ఓపికగా ఉన్నప్పుడే సంపాదించాడు నాలుగు లక్షల రూపాయిలు. తమ్ముణ్ణి పిలిపించి కొడుకుని అప్పగిద్దాము అనుకున్నాడు జబ్బు ఎక్కువౌతోంది గాని తగ్గడంలేదు "అన్నయ్య ఎలా ఉన్నాడో చూద్దాము" అని చెంచయ్యే ఘంటయ్యదగ్గరికి వచ్చాడు. ఘంటయ్యకు ఇంక బ్రతుకు మీద ఆశ లేదు తమ్ముడితో ఇలా అన్నాడు

"చెంచయ్యా, సీతయ్యకు నీవే దిక్కు వాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేసి పెళ్ళి చేయి. నా దగ్గర నాలుగు లక్షల రూపాయిలు ఉన్నాయి వీటిని వాడి పెళ్ళయే వరకు వడ్డీకివెయ్యి. వాడి పెళ్ళయాక మొత్తం సొమ్ము రెండు వాటాలుగా చేసి నీ కిష్ట మొచ్చిన వాటా సీతయ్యకిచ్చి, తక్కినది నీవు తీసుకో" అన్నాడు.

చెంచయ్య అన్నాడు "నీవు చెప్పిన మాట నాకు సమ్మతమే కాని అది వ్రాతమూలకంగా ఉంటే తగాదాలు రావు"అని. "సరే" నని, ఒక కాగితంమీద తాను చెంచయ్యతో అన్నమాటలు వ్రాసి సంతకం పెట్టి ఇచ్చాడు ఘంటయ్య. ఘంటయ్య మరణించాడు. చెంచయ్య దహనకార్యములు చేసి సీతయ్యను తీసుకుని ఇంటికి వెళ్ళాడు.

సీతయ్యకు చదువు చెప్పించి పెద్దవాణ్ణి చేసి పెళ్ళికి యీడు వచ్చిందని పెళ్ళి సంబంధాలు చూసి పెళ్ళి నిశ్చయించాడు సీతయ్యకు పెళ్ళి అయిపోయింది సీతయ్య తన తండ్రి ఆస్తి పంచమని పట్టుబట్టాడు. అప్పటికి నాలుగులక్షల రూపాయిలు ఆరు లక్షలయాయి. చెంచయ్య తన యిష్టమువచ్చినట్లు పంచవచ్చుననుకొని ఐదులక్షలు రూపాయిలు

ఒక వాటాగాను, ఒక లక్ష రూపాయిలు మరో వాటాగాను విడదీసి, ఒక లక్షరూపాయిలు సీతయ్యకిచ్చి "ఇంక నీదారి నీవు చూచుకో. నా బాధ్యత తీరిపోయింది" అన్నాడు. "అయ్యో ఇదేమి అన్యాయం నా తండ్రి ఆస్తి ఏమిటి? నీవు ఐదు లక్షలు నేను లక్ష తీసుకోవడమేమిటి చెరిసగం పంచేయి" అన్నాడు సీతయ్య అలా వీల్లేదు. నీ తండ్రి నాకు కాగితం వ్రాసి ఇచ్చాడు. 'రెండు వాటాలుచేసి నా యిష్టం వచ్చినవాటా నీకు యిమ్మ'న్నాడు. అందుచేత నీ కింక ఒక్కకానీకూడా రాదు" అన్నాడు చెంచయ్య సీతయ్యకు చాలా కోపం వచ్చింది. ఏం చెయ్యగలడు?

సీతయ్య మునసబు కోర్టులో దావావేశాడు కాని న్యాయమూర్తి చెంచయ్య పక్షాన్నే తీర్పుచెప్పారు. సీతయ్య ఊరుకోక జిల్లాకోర్టులో దావావేశాడు అక్కడా చెంచయ్య పక్షాన్నే తీర్పు యిచ్చాడు న్యాయమూర్తి

పట్టుదలతో సీతయ్య హైకోర్టుకు అప్పీలుచేశాడు. హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి చాలా తెలివైన వాడు. సీతయ్యమీద జాలికలిగింది. "ఫలానారోజున తీర్పు చెప్తాను రావలసింది" అని ఫర్మానా చేశాడు.

తీర్పు చెప్పే రోజు వచ్చింది. చెంచయ్య చంకలు కొట్టుకుంటూ "రెండు కోర్టులలో మనపక్షాన తీర్పు చెప్పారు. ఇక్కడ లెక్కేమిటి" అనుకుంటూ కోర్టుకు వచ్చాడు. సీతయ్యా వచ్చాడు న్యాయమూర్తి చెంచయ్యను పిలిచి రెండు వాటాలు "అక్కడపెట్టి ఇందులో నీ కేది ఇష్టము" అన్నాడు. "5 లక్షల రూపాయిలవాటా నా కిష్టము" అన్నాడు. అప్పుడు న్యాయమూర్తి కాగితం(ఘంటయ్య వ్రాసినది) చదివాడు. "నాతమ్ముడైన చెంచయ్య కిష్టమొచ్చినవాటా నా కుమారుని కిచ్చుట కంగీకరించితిని" అని ఉంది ఆ కాగితంలో. సరే ఇంకే ముంది కాగితంలోని ఆ వాక్యము ప్రకారం 5 లక్షల రూపాయిల వాటా సీతయ్యకు వస్తుంది తక్కిన లక్ష రూపాయి వాటా చెంచయ్యకు వస్తుంది అని తీర్పుచెప్పాడు న్యాయమూర్తి అందరూ న్యాయమూర్తి యుక్తికి మెచ్చుకొని ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళారు. ★

## బెంగుళూరు ప్రయాణం

(39-వ పేజీ తరువాయి)

వచ్చాక మెలకువ వచ్చింది అప్పటికే కొద్దిగా వెలుగొచ్చింది. రాత్రి ఏమీతినక పోవడంవల్ల ఆకలిగావుంది. మొహం కడుక్కొని కాఫీ త్రాగేశాను. బెంగుళూరు కంటోన్మెంటుకు 6 గంటలకు జేరింది. మా రైలు ప్లాటుఫారం మీద ఆగగానే ఎవరో టికెట్ కలక్టర్ వచ్చి నన్ను టిక్కట్టు అడిగాడు. నేను నా అరటిక్కట్టు చూపించా. "వల్లకాదు నిండుటిక్కట్టు కొనాలి. పన్నెండు రూపాయలు ఎక్సెసుకట్టు" అన్నాడు. నాకు నోట మాట రాలేదు. దగ్గర వున్న పన్నెండూ తీసి అయన చేతి కిచ్చి, రశీదు అడిగితే "రశీదు ఇవ్వడానికి ఇదేం బట్టలదుకాణం కాదు అన్నాడు. నోరు మూసుకుని సామాను కూలివాని నెత్తిమీద పెట్టి దగ్గర వున్న అడ్రసుప్రకారం ఇల్లుకనుక్కొని వెళ్లాను

మా పిన్ని నామీద కుశలప్రశ్న పరంపరలు కురిపించేసింది. నేను వాటిలో మునిగి, తేలేటప్పటికి ఒక వ్యక్తి తలుపుతోసుకుని వచ్చాడు అరుగో మీ బాబాయ్ అంది మా పిన్ని నిజంగా కొయ్యబారిపోయానంటే నమ్మండి. ఆ వ్యక్తి ఇందాక నా దగ్గర డబ్బు వసూలు చేసిన టికెట్ కలక్టరే! ★

---

ఒక ఫ్రెంచి కార్మికుడు తోటి కార్మికుడి నడిగాడు:
"ఈ రోజున ప్రపంచంలోకల్లా పెద్దదేశం ఏది?"
"ఫ్రాన్సు."
"ఎల్లా?"
"మన సైన్యం ఇండోచైనాలో వుంది. మన ప్రభుత్వం వాషింగ్టన్‌లో వుంది."

# ఆసియా పురోగమనం

(౮-వ పేజీ తరువాయి)

బాధలు ఒకలెక్కలోవి కావనే అభిప్రాయానికి వచ్చేస్తున్నారు

అసలు ఏ కొద్దిమందికో తప్ప-అదీ చాలా వరకు భారతదేశంలోనే, రష్యాపట్లగాని, స్టాలిన్ మార్క్సిజంలోగాని పెద్దమోజున్న వాళ్లు ఆసియా విజ్ఞానవేత్తలలో ఆట్టేమంది లేరు ఈ అభిప్రాయం నాకు ఇండోనీషియాలో వుండగా కలిగింది ఇండోనీషియా మాజీ ప్రధాని డాక్టర్ షరీఫ్ ఉద్దీన్‌గారితో పర్యటించుతూ, సురాకర్టాలో మరాటూ దరాస్‌మన్ అనే ఒకాయన్ని కలుసుకున్నాను డచ్ ప్రతిఘటనోద్యమంలో ఆయన చాలా ప్రముఖమైనప్రాత నిర్వహించారు తరువాత యీయన "మాదియూన్ విప్లవం"లో పాల్గొన్న కారణంగా షరీఫ్ ఉద్దీనుతోపాటు యీయన్ను కూడా ఇండోనీషియన్ సైన్యం కాల్చివేసింది ఒకినాడు దారుస్‌మన్‌గారు ఉపన్యాసవేదిక మీద నుంచి దిగిన ఆయన్ను కలుసుకుని, మార్క్సిస్టు సిద్ధాంతాల విషయంలో ఆయన తన వుపన్యాసంలో మాట్లాడిన అవకతవకలను గురించి చర్చించాను ఆయన యేమీ నొచ్చుకోలేదు 'కావటానికి, నేను ఇండోనీషియా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సంఘంలో సభ్యుడుగా వున్నా నేను మార్క్సిజాన్ని గురించి పెద్దచదువుకోలేదన్నమాట నిజమే ఆర్థిక దారిద్ర్యంలోవున్న మా దేశాలకు కమ్యూనిజాన్ని కేవలం తరుణోపాయంగానే మేము వాంఛించుతున్నాం సర్వసమగ్రమైన పరిపూర్ణ సిద్ధాంతంగా కాదు' అన్నారు

"పారిశ్రామికంగా మా దేశాలు వెనకబడి వున్నయ్ మిత్ర బృందాలను పెంపొందించుకోవటానికి అభిప్రాయ మార్గాలు అన్వేషించటం, ఇతరులమీద మా అభిప్రాయాలు వేసి రుద్దటానికివున్న మార్గాలేమిటా అని ఆలోచించటం-ఇవి కాదు యిప్పుడు మాకు కావలసింది, అధికారాన్ని చేపట్టి దేశానికి త్వరితగతిని ఆర్థికస్తోమత చేకూర్చడం ఎలాగా అనే తాపత్రయంతో వున్నాం' అన్నారు

1947 లో టెహ్రాన్‌లోని పూరి గుడిసెల వీధిలో ఒక యువకుణ్ణి కలుసుకున్నాను పెట్రోల్ ధన ప్రవాహంమీద తెపకలు తేలుతున్న దేశం అయివుండికూడా, ఆ దేశంలోని బీదప్రజలు అనుభవించుతున్న దుర్భర పరిస్థితుల నన్నిటినీ నాకు ప్రత్యక్షంగా చూపించి, జర్నలిస్టుననే నా అహంకారాన్ని ఖూనీ చెయ్యటానికి ప్రయత్నించుతున్నాడు అంత ఆవేశంతో మాట్లాడుతూ కూడా, మధ్యమధ్య అమెరికన్ డాన్సు రికార్డులను గురించీ, హాలీవుడ్ తారల అభినయాన్ని గురించి నన్ను భోగట్టా అడుగుతూనే వున్నాడు-తాను మెడలో కట్టుకున్న అమెరికన్ 'టై'ని మునివేళ్లతో మెలిపెడుతూ, ఆ యువకుణ్ణి చూస్తే చాలా ఆశ్చర్యం వేసింది

"ఇలాంటి అమెరికన్ అభిరుచులన్నీ వుండికూడా వీరు కమ్యూనిస్టులని చెప్పుకుంటారేమిటి? అని అడిగాను "ఇంతమాత్రం అర్థం చేసుకోలేకపోయారా!—ఏముందండీ, ఇలాంటి మంచి మంచి వస్తువులన్నీ నా ప్రజలందరికీ లభించాలని నేను కోరుతున్నాను పెట్టుబడిదారీ పంథాను పట్టుకు వ్రేలాడితే తరాలు గడిచినా యివి నా ప్రజలందరికీ చేకూరగలవనేది అనుమానాస్పదం రష్యాలో మోస్తరుగా ఎంత త్వరలో వీలైతే అంత త్వరలో వాటిని మా వాళ్లందరికి సిద్ధింపచేయటానికి నేను ప్రయత్నించుతున్నాను అన్నారు

ఆసియాలోని విజ్ఞానవంతులంతా రష్యాపట్ల కంటే చైనాపట్ల యెక్కువశ్రద్ధ చూపుతున్నారు చైనాలో వస్తున్న దైనందిన పరిణామాలను అత్యంత శ్రద్ధతో గమనించుతున్నారు చైనాసమస్యలూ, తమ దేశాల సమస్యలూ కూడా ఒకేమాదిరిగా వున్నాయనే అభిప్రాయంకూడా విస్తృతవ్యాప్తిలో వుంది ఇటీవల "మాంచెస్టర్ గార్డియన్" (ఫిబ్రవరి 12, 1951) సంపాదకీయంలో 'కమ్యూనిస్టుచైనా గనుక యే ఒక్క పరిశ్రమనైనా విజయవంతంగా పెంపొందచేయగలిగితే, భారతదేశంలో కమ్యూనిజంపట్ల చాలా సుముఖత యేర్పడే సావకాశం వుంది, భారతదేశపు పెట్టుబడిదారీ విధానంలో స్థానిక ప్రజలకు యేమాత్రం విశ్వాసంలేదు అని వ్రాసింది

పై విషయాలన్నిటినీ సమగ్రంగా దృష్టిలో వుంచుకుని-కామన్వెల్తు కొలంబో ప్రణాళిక ఫలితాలనుగాని, అమెరికా చతుస్సూత్ర ప్రణాళిక ఫలితాలనుగాని మనం అంచనా వేయవలసి వుంటుంది పునర్నవచైతన్యంతో ప్రభవించుతున్న ఆసియా స్వతంత్ర రాజ్యాలన్నీ, త్వరితగతిని పైకి రావాలనీ, వీలైనంత తొందరగా పారిశ్రామిక బలాన్ని చేకూర్చుకోవాలనీ ఆదుర్దా పడుతున్నయ్ వాటిని, వెనువెంటనే, యెవరు చేకూర్చి సహాయపడితే వారివైపు మొగ్గిపోవటానికి సిద్ధంగా వున్నయ్

ఆసియారాజ్యాలు తీసుకున్న నిర్ణయాలు ప్రపంచవ్యవస్థలో వుండే సమతుల్యాన్ని యిప్పటికి కొంతవరకు అస్తవ్యస్తం చేసినా భవిష్యత్ నిర్ణయాలుసాంతం తల్లకిందులు చేసేస్తే చెయ్యవచ్చుకూడా ★

## గ్రంథ స్వీకారం

"దేవయాని"

కర్త స్ఫూర్తిశ్రీ
ప్రకాశకులు విపంచికా ప్రచురణలు, కాకినాడ

వెల అర్థ రూపాయి

---

"సింద్ బాద్"

కర్త శ్రీ బి విశ్వేశ్వరరావు
ప్రకాశకులు. "బాబు" కార్యాలయం, కథీడ్రల్, మద్రాసు-6
వెల 6 అణాలు

---

"కన్నవీ విన్నవీ" (కథలు) మొదటి భాగం

కర్త శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి ప్రకాశకులు మొక్కపాటివారు, మదరాసు వెల రూపాయిన్నర.

## గ్రంధ సమీక్ష

రోజా (చిన్న కథలు)

రచయిత శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు, 14, న్యూస్ట్రీట్, మైలాపూర్, మద్రాసు-4 వెల 1 రూపాయి.

ఇందులో నవీనపేకి, ఆత్మకథ, దురదృష్టం, సౌందర్యం, రోజా, తీర్థంకరుడి రెండో దర్శనం, ఇది మన సాంప్రదాయమా, రహస్యమంటే? అన్న 8 కథలు ఉన్నవి ఇందులో రోజా అన్న కథ అన్నివిధాలా బాగా ఉన్నది దీనిని గిడుగు రామమూర్తిగారు కూడా మెచ్చుకున్నారు మన్యం ప్రజల జీవిత పరిస్థితులను చాల ఆకర్షణీయంగా ఈ కథ వివరిస్తున్నది

సౌందర్యం, తీర్థంకరుడి రెండో దర్శనం అన్న కథలు నేటి కవిత్వధోరణినీ, పట్టణాల మాలిన్యాన్నీ విమర్శిస్తూ వ్రాసిన వ్యంగ్యరచనలు ఈ ధోరణిలో రచయిత మరికొన్నిటిని వ్రాయాలని అభిలషిస్తున్నాము. ★

కథానిక:




పది ఏళ్ల క్రిందట కట్టు బట్టలతో ఆ ఊరు వచ్చి, ఉప్పు, చింతపండు, పసుపు, మిరపకాయలు, నూనె, ఊరుపిండి వడియాలు—అమ్ముకునే సూర్నారాయణ, ఈ రోజున ఆ ఊరికి ఒక లక్షాధికారై పెద్ద మేడ కట్టించి, ఊరికి పలుకుబడి దారుడై 'సూర్యనారాయణ శెట్టి' అయి కూర్చున్నాడంటే, అతని అదృష్టం ఎంతవరకూ పెరిగెత్తిందో - మనం కొద్దిసేపట్లో యోచించగలం

యుద్ధకాలంలో మిలిటరీ సామాను దొంగతనంగా కొని, దొంగపద్దులు కొని, తాకట్టుపద్దులు ఎగగొట్టి, ముఖ్యంగా, నల్లబజారు వ్యాపారం చేసి, వాడి బుజ్జ వీడికి, వీడిబుజ్జ వాడికి మార్చి, ఎలాగైనా కోమటి బిడ్డగనక, గిరున పదేళ్లు తిరగకుండా, ఐశ్వర్యాన్ని అనుభవించ గలుగుతున్నాడు అతనిలో ముఖ్యమైన సంగతి ఏమిటిఅంటే, డబ్బు లేనప్పుడు ఎంగిలిచేత్తో కాకిని కొట్టేవాడు కాదు ఇప్పుడూ అంతే! అంతటి లోభత్వం వెయ్యబట్టే, 'ఈ నాడు శెట్టి అంతటి గొప్పవాడు కాగల్గినాడు'—అని, అనడంలో ఆశ్చర్యం లేదు

ఇప్పుడు సూర్యనారాయణ శెట్టి దొక పెద్దషాపు టోకు వ్యాపారమేగాని చిల్లర వ్యాపారం నడపడు అంతా నల్లబజారు వ్యాపారమే! ఉద్యోగుల నోళ్లన్నీ సంచిట్టుతో బంద్! అందరికీ నల్లబజారు మామూళ్లే! చిన్న బంట్రోతుదగ్గర నుండి తాసిల్దారువరకూ,— పోలీసు సూపరెంటెండెంటు వరకూ,—సూర్యనారాయణ శెట్టి లంచాలు మామూళ్ళుగా యిచ్చి, వాళ్ళనోళ్లు కడుతున్నాడనడంలో అతిశయోక్తిలేదు అందువల్ల, అతని వ్యాపారం నిర్విఘ్నంగా సాగడానికి, అతడు ఐశ్వర్యవంతుడు కావడానికి, అడ్డులేకుండా పోతూవుంది

కేషనింగు ఆఫీసరు ధర్మారావు వస్తున్నాడనీ, పాతవానికి ట్రాన్సుఫర్ అయినదనీ అందరకూ తెలిసింది క్రొత్తవాడు, తను ఏమాత్రం లంచం పుచ్చుకోడనీ, ఖచ్చితంగా పనిచేస్తాడనీ, డబ్బుకి తగినట్లు కరకస్టు మనిషని అందుకు కర్కోటకుడని ప్రజలు ఘోషించారు ఈ వార్త విన్న సూర్యనారాయణశెట్టి గుండెలు, పిచుపిచుమన్నాయి చిఠా అవర్జాలో వేసినవి, 100 బస్తాల ధాన్యమే అయినా, యింటిలో పడి మూల్గుతున్నవి, 1,000 బస్తాల ధాన్యం తన లంచం ప్రభావంవలన, పాత ఉద్యోగస్తుని నోరు కట్టి, తనిఖీచేసే అవకాశాన్ని యివ్వలేదు శెట్టి కాని, 'క్రొత్తవాడు! ఏమో! ఏమంటాడో?'—అని, శెట్టి గుండెలు గుభేలుమన్నాయి క్రొత్త ఆఫీసరైన ధర్మారావు వచ్చి, రెండు నెలలు అయినా, అతని గాలి మన సూర్యనారాయణ శెట్టికి ఏమీ తగలనందున, తన వ్యాపారం నిరాఘాటంగా సాగించవచ్చు ననుకున్నాడు.

15 పంచదార బస్తాలకు పర్మిటు వ్రాయించి, 50 బస్తాలు, లారీలమీద వేసుకొని, అర్ధరాత్రిలో, శెట్టి, అతని బృందం వస్తున్నారు ఎదురుగుండా ధర్మారావు కేంపునుండి, కారులో వస్తూ,—దారిలో తనకు ఎదురైన లారీలను ఆపమన్నాడు లారీలు తనిఖీ చెయ్యబడ్డాయి 50 పంచదారబస్తాలు! ఒకటి కాదు, రెండుకాదు!

"పర్మిట్ చూపించ?" మని - అడిగాడు అధికారి

"అదా, అదా అండి మా శెట్టిగారి దగ్గర వుంది"—అన్నాడు గుమస్తా నీళ్ళు నములుతూ

"మీ శెట్టిని తీసుకురావయ్యా?"—అరిచాడు

"ఆయన పనుకున్నారండీ"

"షటప్, నాన్సెన్సు! చెకింగుకి ఆఫీసరు వస్తే, మాట్లాడ్డం తెలీదా? పోవయ్యా మీ శెట్టిని తీసుకురా?" అని—గర్జించాడు ధర్మారావు.

ప్రక్కనుండే పొంచుండి వింటున్న సూర్యనారాయణ శెట్టి, యింక లాభంలేదనుకొని, ధర్మారావుముందు తనపద్ధతి నంతా ఏకరవు పెట్టి, ఆఫీసరు మామూలంటూ, 500/రు అతని చేతి కందించాడు. ధర్మారావుకికోపం ఎక్కువైంది. నోట్లకట్టను విసిరికొట్టి,—"నేనేం, లంచగొట్టు ననుకున్నావా? నీ డబ్బు నువ్వు పట్టుకొని, స్టేషనుకు లారీలు నడిపించు," అన్నాడు తన అధికారాన్ని వినియోగిస్తూ

ధర్మారావుని సూర్యనారాయణ శెట్టి, కాళ్లావేళ్లా పడి బ్రతిమాలాడు ఆఖరికి ఒక సంచి, 1,000/రు అతని చేతికిచ్చాడు ఆఫీసరు అందుకు మండిపడి, "నువ్వు లక్షరూపాయలిచ్చినా వదులుతా ననుకున్నావా? న్యాయంకోసం ప్రాణాన్నయినా యిస్తాను ఇది నా ఉద్యోగధర్మం"—అన్నాడు ధర్మారావు

"అంతా తమలాగే అంటే, దేశం ఎంత బాగుపడుతుంది!" కొద్దినిముషాలు మౌనంగా వుండి, వెనక్కి ఒక అడుగు వేసి, పిడికిడి ఝుడిపిస్తూ,—". ఆఖరి మాట మీకు డబ్బు కావలిస్తే, ఇది తీసుకొని మీ దారిని వెళ్లండి. లేదా! మరి మీరు ఇంటికి వెళ్లలేరు"—అన్నాడు శెట్టి ధైర్యంగా

అధికారి హుంకరించాడు శెట్టికను సైగతో, వెంటనే ధర్మారావువెనుకనుండి కఱ్ఱలు ధర్మారావు తలమీద పడ్డాయి స్పృహతప్పి పడిపోయాడు అతన్ని యీ లోకంనుండి పంపించాడు శెట్టి కారు డ్రైవరు నోరు పంచికట్టుతో బంద్!

మర్నాడు ఊరంతా గుప్పుమంది "మహారాజులాంటి మనిషి న్యాయమైన ఉద్యోగి, ఈ రోజుల్లో దొరుకుతారా? అలాంటి వాడ్ని రాత్రిదొంగలు కొట్టి పడేశారు"—అని

సూర్యనారాయణశెట్టి చందాలు ఎత్తి, అతని కుటుంబానికి పంపేడు సానుభూతిగా! లంచగొండిఆఫీసర్లు (ధర్మా

# అదీ - ఇదీ

(7-వ పేజీ తరువాయి)

'విజా' సులభంగానే లభించినట్లు కనపడుతుంది. బ్రిటన్ చేసిన ఈ ఉపకారాలకు ఉత్సాహం కనబరచకపోతే చైనావారు క్షంతవ్యులు

"గత జనవరిలో, షేషరతుగా యుద్ధ విరమణ జరిగి తదనంతరం కొరియా సమస్య సంప్రతింపులద్వారా పరిష్కారం కావాలని ఐక్యరాజ్యసమితి ఒక తీర్మానం చేసింది ఇవి తిరుగులేని ఆదేశమన్న భావం అధికారప్రకటలలో సూచితం కాలేదు అందుచేత, తాత్కాలిక యుద్ధవిరమణ జరిగి తదనంతరం సప్తరాజ్య సమావేశం జరగాలని చైనా ప్రతిసూచన చేసింది దూరప్రాచ్య సమస్యలన్నిటి పరిష్కారానికి గల షరతులేవో, ఏధోరణిలో చర్చలు జరగాలో చౌఎన్‌లాయ్ ప్రకటనలు విస్పష్టంచేశాయి. "చైనా ఇంతకంటె రాజీ వైఖరి ఎలా అవలంబించగలదో తెలియకుండాఉన్నది" అని జనవరి 27 న మాపత్రిక (న్యూస్టేట్స్‌మన్) అన్నది ఇదిప్రతిసూచనే గాని ఐక్యరాజ్యసూచన నిరాకరణ కాదని నెహ్రూ మొదలైన వారు ఎంత చెప్పినప్పటికీ, అమెరికా ప్రభుత్వం మొదలైనవి (బ్రిటిషు ప్రభుత్వంతోసహా) చైనా సూచనను తృణీకరించి 12 అరబ్బు ఆసియా దేశాల శాంతియత్నాలను తోసిరాజని చైనాను దురాక్రమణదారుగా ప్రకటించడానికి ఉపక్రమించాయి"

## హాలండుఅగచాట్లు

మొదటిసారి ఐసెన్ హోవర్ (అట్లాంటిక్ రాజ్యాల సర్వసేనాని) పశ్చిమయూరప్ పర్యటించిన ఫలితంగా (గత) జనవరిలో డచ్చి ప్రభుత్వం పతనమయింది అంతులేని చర్చల అనంతరం పాతప్రధాని డా విలెమ్ డ్రీస్‌తోనే అదేమాదిరి సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడింది ఆర్థిక, రక్షణ శాఖలు "దివాలా" తీయకుండా చూడడానికి డ్రీస్ ప్రభృతులు అతి ధైర్యంతో కృషి సాగించారు

ప్రాచ్యంలో తన సామ్రాజ్యాన్నీ, యూరప్‌లో యుద్ధానికిపూర్వం తనకుండిన వర్తకాన్నీ కోల్పోయిన హాలండు దాదాపు దివాలా తీసింది. కిందటి వారం నుంచీ పశ్చిమ యూరపుదేశాలకున్న బాకీలను (హాలండు) చాలావరకు బంగారంతోనూ, డాలర్లతోనూ చెల్లించవలసిన పరిస్థితి ఏర్పడింది ఈ రిజర్వులు చాలా పలచబడి పోయాయి డచ్చిప్రజల కొనుగోలు శక్తిని తగ్గించే ఉద్దేశంతో (డచ్చి) ప్రభుత్వం తీవ్రమైన ద్రవ్యోల్బణ నిరోధ పథకం అమలు చేసింది దీనితోబాటు 4 ఏళ్ల కాలంలో 1, 57, 89, 50, 000 డాలర్ల ఖర్చుతో యుద్ధప్రయత్నాలు తయారు చేసి సాధ్యమైనంత ద్రవ్యాన్ని చలామణీలోనుంచి తీసివేయ జూస్తున్నది

ఇండొనీషియాలో యుద్ధం చేసిన సైనికులను సైతం సైనికాధికారులు యుద్ధ శిక్షణకు పిలిచారు వీరిలో 5, 600 మంది సైనిక అభ్యాసప్రదర్శనలలో పాల్గొన్నారు ఈ ప్రదర్శనలు కేవలం హాస్యాస్పదంగా పరిణమించాయి "శత్రు" విమానాలు దాడిచేస్తుంటే ఈ సైనికులు పత్రికలు చదువుకుంటూ యుద్ధరంగంలో నిలబడ్డారు మర తుపాకుల కాల్పులు జరుగుతున్నట్టు నటించే సమయంలో నిశ్చింతగా వాటి ముందుగా నడుచుకుంటూ వెళ్లారు వీరు వెకిలిచేష్టలు చేసి, ప్రదర్శనలు చూడ వచ్చిన ప్రజలకు జుగుప్స కలిగించారు ప్రదర్శనలు ఆకస్మికంగా ఆపుచేయబడ్డాయి ఇకముందు జరిగే అభ్యాసాలు చిన్న చిన్న సైనిక ముఠాలతో జరుగుతాయని ప్రకటించబడింది

—మే 21 "న్యూస్‌వీక్"

## ఫ్రాన్సులో పన్నులు

ఫ్రాన్సులో—ఆమాటకు వస్తే ఇటలీలో కూడా—ప్రజలు కట్టే పన్నులు, అమెరికనులు కట్టే పన్నుల కెక్కడా చాలవని ఒక అపోహ ఉన్నది దేశీయాదాయం దృష్ట్యా చూస్తే ఇది నిజం కాదు మైకేల్ హాఫ్మన్ లెక్కలప్రకారం అమెరికాలోని దేశీయాదాయంలో నూటికి 26 వంతులూ, ఫ్రాన్సులోని దేశీయాదాయంలో నూటికి 32 వంతులూ ఏదో పన్నురూపేణా చెల్లించబడుతోంది ఈసంఖ్య యుద్ధానికి పూర్వం 25 ఉండేది యుద్ధానంతరం 20, 25 మధ్యగా ఉన్నట్టు ఇ సి ఏ లెక్కలు తెలిపాయి

ఫ్రెంచివిధానంలో ఉన్న చిక్కేమంటే అది కొన్ని తరగతులమీద భారంవేసి ఇతర తరగతులను తేలికలో పోనిస్తుంది. 1947లో జీతాలమీద జీవించేవారు నూరింట 70 వంతుల పన్ను కట్టినట్టు తెలుస్తుంది వ్యాపారసంస్థలు కట్టిన పన్ను ఒక లెక్కలోది కాదని ఇ సి ఏ వారు తెలిపారు పన్నులో చాలా ఎక్కువభాగం పరోక్షపన్ను ఈవిధానంలో పొదుపుగా ఉండేవారూ, న్యాయస్థులూ, బీదవారూ బాధపడినట్లు కనిపిస్తుంది

—మే 13 "న్యూయార్క్ టైమ్స్"
సంపాదకీయం.

## రష్యా శాస్త్రవిజ్ఞానాలు

("సైంటిస్ట్ ఇన్ రష్యా" అనే గ్రంథాన్ని రచించిన) ప్రొఫెసర్ ఆష్బి రష్యా వ్యామోహి అయిన కమ్యూనిస్టు కాదన్నది స్పష్టం అందుచేత రష్యాలోని యథార్థ విషయాలను గురించి ఆయన చేసిన ప్రశంసలకు మరింత ప్రాముఖ్యం ఉంటుంది.

" సామాన్య ప్రజలలో శాస్త్రవిషయాలందు ఆసక్తి ఉండడమనేది రష్యాలో ఉన్నంతగా ప్రపంచంలో ఎక్కడా, ఆఖరుకు అమెరికాలో కూడా లేదు పత్రికలూ, పుస్తకాలూ, ఉపన్యాసాలూ, సినిమా-చిత్రాలూ, పార్కులలోనూ, మ్యూజియములలోనూ ప్రదర్శనలూ, శాస్త్రవేత్తల గౌరవార్థం గాని, వారి పరిశోధనల గౌరవార్థం గాని తరుచుగా జరిగే వేడుకలూ మొదలైనవాటివల్ల ప్రజలకు శాస్త్రవిజ్ఞానం అందుతూ ఉంటుంది. మాస్కో విద్యార్థులకొరకు ఏటా శాస్త్ర పోటీలు జరుపుతారు టెన్నిస్ ఆటల పోటీలలోలాగా ఒక్కొక్కరు ఒక్కొక్కర్ని ఓడిస్తూ, గెలిచినవారిలో మళ్లీ పోటీ

---

రావు (క్రిందివారు) 'పీడ వదిలింది' అనుకున్నారు ఈ రోజుల్లో, నూటికి ఎక్కడో ఒక్కడు చొప్పున, న్యాయం కోసం ఉద్యోగ ధర్మాన్ని నెఱవేర్చిన ఉద్యోగులు సహజంగా ధర్మారావు గురించి విచార సానుభూతి తెల్పారు "అదే అతని ఆత్మకు శాంతి"—అన్నారు న్యాయమంటే ఏమిటో అనుభవంలోనున్న కొందరు ఉద్యోగులు.

సాయంత్రం శెట్టి, మీటింగులో, అంతటి గొప్ప న్యాయ ఉద్యోగ ధర్మపరిపాలకుడు అకస్మాత్తుగా పోవడం,—తనవంటి న్యాయమైన వ్యాపారస్థులకు దెబ్బ! అన్నాడు న్యాయవంతులైన ధర్మారావు గారు, మాబోటి న్యాయాన్యాయ విచక్షణ తెలియని మాకు న్యాయాన్నిచ్చేందుకైనా మేము నోచుకోలేదు

ఎలాగూ లంచానికి యివ్వ నుద్దేశించిన వెయ్యి రూపాయల్లోనూ, శెట్టి తన నిధి క్రింద 500/ రు వాళ్లకు విరాళ మిచ్చాడు మిగతా, 500/ రు కాశీకని వుంచాడు పాప పరిహారార్థం!



జరుగుతూ పోతుంది చిట్టచివరకు ఈ పోటీలో పరిష్కరించబడిన సమస్యల తాలూకు ప్రయోగాలు చూడడానికీ, గెలిచినవారు బహుమతులు పుచ్చుకోవడం చూడడానికీ విద్యార్థులు యూనివర్సిటీలో సమావేశమౌతారు " అని ప్రొ ఆష్బీ వ్రాస్తున్నాడు

సోవియట్ పత్రికలలో, సీరియల్ కథా చిత్రాలూ, హత్యలూ, విడాకుల కేసులూ ఆక్రమించవలసిన స్థానాన్ని ప్రజాశాస్త్రం ఆక్రమిస్తుంది తేలికసాహిత్యంలో, ప్రణయాలూ, యుద్ధాలూ ఉండడానికి బదులు, ప్రకృతి రహస్యాలు తెలుసుకొనడానికి మానవుడి కృషి ప్రధాన విషయంగా ఉంటుంది గణిత విషయాలూ, శాస్త్ర పరిశోధనలు, కొత్త విషయాలు కనిపెట్టడం, రేడియో ప్రసారాలూ, ధృవప్రాంతపర్యటనలూ, వంతెనల, కాలవల నిర్మాణమూ, రసాయనవేత్తలూ, వైద్యులూ సోవియట్ లలలో ప్రధాన వస్తువులు

కిలెటివిటీ, పరిణామవాదమూ, జీవశాస్త్రమూ, రసాయనశాస్త్రమూ, వస్తువిజ్ఞానమూ, ప్రత్యేక శాస్త్రాల చరిత్రలూ వగైరాలను గురించి తేలికైన భాషలో అంతులేని ప్రచురణలూ, తక్కువ ఖరీదు కరపత్రాలూ న్నాయి

ఆష్బీ తెలిపిన విషయాలనుబట్టి సోవియట్ పాయిఖానాలకంటె పెట్టుబడిదారీ సాంఘికవ్యవస్థ హేయంగా ఉన్నట్టు తోస్తుంది (తన పుస్తకంలో ఆష్బీ సోవియట్ రైళ్లలోని పాయిఖానాలను జుగుప్సాకరంగా వర్ణించిఉన్నాడు ) సోవియట్ వార్తాపత్రికలలో గాని, పుస్తకాలలో గాని, ఉపన్యాసాలలో గాని, రేడియోలో గాని, సినిమా చిత్రాలలో గాని అసభ్యతనూ, నేరాన్నీ వ్యాప్తిచేసే అంశాలు లేవు గూఢచారుల విచారణల లాగా రాజకీయ ప్రాముఖ్యం ఉంటే తప్ప మామూలు కోర్టు విచారణలను ప్రచురించరు .

1945 లో తయారైన "ది లా ఆఫ్ ఇటర్నల్ లవ్" అనే సోవియట్ చిత్రంలో ప్రేమ చూపబడింది ఇది పశుపక్ష్యాదులలో ఉండే మాతృప్రేమ ఇందులో ప్రధాన తారలు మూడు గుంటనక్కలు తేనెటీగలను గురించీ, సూర్యచంద్ర గ్రహణాలను గురించీ, వృక్షశాస్త్రం గురించీ, పురావస్తుశాస్త్రం గురించీ కూడా సినిమా చిత్రాలున్నాయి

ప్రసిద్ధ శాస్త్రజ్ఞుల జయంతులూ, వర్ధంతులూ, తదితర సందర్భాలూ వచ్చినపుడు మీటింగులు జరుగుతాయి పార్కుల్లోనూ, క్లబ్బులలోనూ, పురమందిరాలలోనూ, సంస్థలలోనూ, సమష్టి వ్యవసాయక్షేత్రాలలోనూ, ఫాక్టరీలలోనూ, జైళ్లలోనూ మీటింగులు జరుగుతాయి "మాట్లాడటంలోనూ, వినడంలోనూ సోవియట్ ప్రజలకుగల ఆసక్తిని మెచ్చుకోక తప్పదు," అని ఆష్బీ ఒప్పుకొంటున్నాడు "పూర్వం రష్యాలో గాని, ప్రపంచంలో మరెక్కడగాని లేనంతగా (సోవియట్) ప్రజాసామాన్యానికి శాస్త్రవిజ్ఞానం అంటుతున్నది " నానా వంగడాలలో ఎయితం "గొట్టు" విషయాలను గురించి వినడానికి జనం గుంపులుగుంపులుగా వస్తారు

ఉన్నత విద్యాసంఘంవారు ఏటా 10 వేల ఉపన్యాసాలు ఏర్పాటుచేసి అనేక లక్షలమందికి వినిపిస్తారు ఉపన్యాసాలను గురించి కరపత్రాలు ప్రచురిస్తారు సుమారు 12 బస్తీలూ, 1,500 గ్రామాలూ గల ప్రతి జిల్లాలోనూ శాస్త్రవిషయాలను గురించి మాట్లాడే ఉపన్యాసకులు 1,500 మంది ఉంటారు 1946 జూను 30 న అణుశక్తి యొక్క పారిశ్రామిక ప్రయోజనాలను గురించి జరిగిన ఉపన్యాసాన్ని లక్షమంది విన్నారని తెలుస్తున్నది మరునాడే అమెరికాలో అణువుబాంబు తొలిపరీక్ష జరిగింది

"మెచ్నికోవ్ పేరు లక్షోపలక్షల సోవియట్ పౌరు లెరుగుదురు రక్తంలోని క్రిమివిధ్వంస కణాలను గురించీ, పిండశాస్త్రం గురించీ, వార్ధక్యసమస్య గురించీ మెచ్నికోవ్ పరిశోధనలు చేశాడని వారికి తెలుసును అదేవిధంగా తిమిర్యాజేవ్, మిచురిన్, లూబాచెవ్‌స్కీ, మెండెలియెవ్ మొదలైనవారిని గురించీ, వారు చేసిన కృషి గురించీ సోవియట్ ప్రజలకు తెలుసు " అని ఆష్బీ వ్రాస్తున్నాడు.

"రేడియో, విమానం, ఆవిరియంత్రం, స్టీమ్ టర్బైన్, ఎలెక్ట్రిక్ ఆర్కు, విద్యుద్దీపాలు, జెట్ ప్రొపల్షన్, రాకెట్ ప్రొపల్షన్, హెలికోప్టర్ విమానం, పెనిసిలిన్- ఇవి ప్రపంచానికి రష్యా పెట్టిన భిక్ష అని తెలిస్తే ఇంగ్లీషువారికి ఆశ్చర్యం కలగవచ్చు ((ప్రతి పదార్థంలోనూ ఫ్లాజిస్టాన్ అనే పదార్థం ఉండి పదార్థాలు బూడిద అయినప్పుడు ఎగిరిపోతుందన్న) ఫ్లాజిస్టాన్ సిద్ధాంతం తప్పని లెవోయిసియర్ బయటపెట్టక పూర్వం లొమొనోసోవ్ (రష్యన్ శాస్త్రజ్ఞుడు) బయటపెట్టాడు పచ్చని ఆకులలో సూర్యకాంతి సహాయంతో జరిగే ఆహారసృష్టిని గురించి మొదటగా వివరించినవాడు తిమిర్యాజెవ్ "

రైట్ బ్రదర్స్‌కు 20 ఏళ్లు ముందుగానే ఏ పి మొఝాయిస్కీ మొట్టమొదటి విమానాన్ని కట్టి పరీక్షించాడు 1910 - 12 మధ్య ఝుకోవ్‌స్కీ శిష్యులు మొట్టమొదట హెలికోప్టర్ (సూటిగా పైకి లేచే) విమానాన్ని విజయవంతంగా తయారుచేశారు జి కొతెల్నికోవ్ అనే రష్యన్ నటుడు పారాషూట్ కనిపెట్టి పారిస్‌లో ప్రదర్శించాడు ఎలెక్ట్రిక్ ఆర్కును డేవీ సృష్టించాడని సామాన్యంగా చెబుతారు, ఆయన 1810 లో 2 వేల జతల ప్లేటుగల బాటరీ తయారుచేసి రాయల్ సొసైటీకి బహూకరించాడు కాని ఎలెక్ట్రిక్ ఆర్కును వి వి పెట్రోవ్ అనే మేధావి అంతకు పూర్వమే సృష్టించి 1803 లో దానిని గురించి వ్యాసం ప్రకటించాడు ఆయన తయారుచేసిన బాటరీలో 4,200 జతల ప్లేట్లు ఉన్నాయి 1765 లో పొల్జునోవ్ మొదటి ఆవిరియంత్రం తయారుచేశాడు మొదటి ఆవిరి టర్బయిను తయారుచేసినవాడు జాలెసోవ్ ఎడిసన్‌కన్న ముందుగానే 1873 లో ఏ ఎన్ లోడిగిన్ విద్యుద్దీపం నిర్మించాడు 1895 మే 7 న ఏ ఎస్ పొపోవ్ రేడియో తయారుచేశాడు

—మే 13, "నేషనల్ హెరాల్డ్"లో "కాడ్యూసియస్"

# డైరీ

(4-వ పేజీ తరువాయి)

—అంతర్జాతీయ న్యాయసూత్రాల పేరుతో కొన్ని విదేశాలు కాశ్మీర్ సమస్యలో జోక్యం చేసుకుని మరో కొరియాను సృష్టించాలని ప్రయత్నిస్తున్నట్టు కాశ్మీర్ ముఖ్యమంత్రి షేక్ అబ్దుల్లా నేడు ప్రారంభమైన అఖిల జమ్మూ కాశ్మీర్ జాతీయ మహాసభ సమావేశములో ఆరోపించారు తాము అనుకున్న కార్యక్రమం నిరంతరాయంగా జరిగి తీరాల్సిందేనని ఆయన ఉద్ఘాటించాడు

—అగ్రరాజ్య చతుష్టయ విదేశాంగ మంత్రుల సమావేశము వాషింగ్టన్‌లో జులై 23 న జరగాలని అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులు రష్యాకు సూచన చేసినవి

—హైదరాబాదు పోలీసుల కస్టడీలో ఉన్న ఇద్దరు కమ్యూనిస్టు ఖయిదీలు గుత్తా సీతారామరెడ్డి, పిల్లా రామచంద్రారెడ్డి అనువారు మొన్న 30 వ తేదీన హతమయినట్లు తెలిసింది ఈవిషయాన్ని విచారణ చేయడానికి ప్రభుత్వ మొక న్యాయాధిపతిని నియమించింది

—111 గురు చేనేత సత్యాగ్రహులరెస్టయ్యారు వచ్చే 16 వ తేదీనుండి జిల్లాలన్నిటిలోను సత్యాగ్రహం సాగించటానికి కార్యాచరణ సంఘం తీర్మానించింది

—మంజూరైన ప్రణాళికలకే పంచవర్ష ప్రణాళికలో స్థానం ఉన్నందున రామపాదసాగరం, సంగమేశ్వరం ప్రాజెక్టులకు అందులో స్థానం లేదనీ, తర్వాతవచ్చే పెద్ద ప్రణాళికలలోకూడా అప్పటి పరిస్థితులను బట్టిగాని వాటికి స్థానం లభించేదీ, లేనిదీ చెప్పలేమనీ భక్తవత్సలంగారు చెప్పారు

—కలకత్తాలోని ఇండియా ఎయిర్‌వేస్ కంపెనీ తాలూకు 90,800 రూ ధనం సాయుధ చోరులచే అపహృతమైంది

—జూన్ నెలకు మద్రాసుకు 61 వేల టన్నుల బియ్యం కేటాయించినట్లు, మద్రాసు కిస్తున్న ధాన్యం కోటాలను పెంచటాన్నిగూర్చి ఆలోచిస్తున్నట్లు మంత్రి మున్షీ ప్రకటించారు

—బీహారులో బీదజనం గడ్డితిని బతుకుతున్నారన్న వార్తలను మంత్రి మున్షీ ఖండించారు 1950 లో భారతప్రభుత్వం 80 కోట్ల 60 లక్షల రూ విలువైన 21 లక్షల 25 వేల టన్నుల ఆహారధాన్యం దిగుమతిచేసుకున్నట్లు, ఈ ఏడాది మేనెల 20 వరకూ 221 నౌకలలో 49 కోట్ల 84 లక్షల రూ ల విలువైన ధాన్యం దిగుమతిచేసినట్లు కూడా చెప్పారు

—కృష్ణా జిల్లాబోర్డు గత 28 వ తేదీ సమావేశంలో జిల్లాలో రోడ్లనిర్మాణం, మరమ్మతు ఖర్చులక్రింద 6½ లక్షల రూ మంజూరు చేయబడింది.

## శనివారం, జూన్ 2:

—జపాన్ సంధివిషయమై బ్రిటన్‌తో సంప్రదించుటకు ట్రూమన్ స్వంత రాయబారి జాన్ ఫాస్టర్ డలెస్ లండను బయల్దేరాడు లండననుంచి పారిస్ కూడాపోయి చర్చ జరుపుతాడు

—రాజ్యాంగ సవరణబిల్లు ద్వితీయ ప్రతిపాదనలో 222 వోట్ల మెజారిటీతో ఆమోదింపబడింది అనుకూలంగా 234 వోట్లు, ప్రతికూలంగా 12 ఓట్లు పడ్డాయి భారతీయులుకాని న్యాయమూర్తులను సుప్రీంకోర్టు న్యాయమూర్తులుగా నియమించరాదని కె టి షా తెచ్చిన సవరణ నెగ్గింది

—మరొక 10 లక్షల టన్నుల ఆహారధాన్యం సప్లయి చేయాలని ఇంకొకసారి భారతప్రభుత్వమును మద్రాసు ప్రభుత్వం కోరగలదని తెలిసింది

—34 గురు చేనేత సత్యాగ్రహులు అరెస్టయ్యారు

—38 వ అక్షాంశానికి పదిమైళ్లు ఉత్తరానికి పురోగమించిన ఐక్యరాజ్య సైన్యాలకు కమ్యూనిస్టు ప్రతిఘటన తీవ్రతరమైంది

—భారత ప్రభుత్వంద్వారా కమ్యూనిస్టు చైనాకు శాంతి ప్రతిపాదనలు చెయ్యటానికి ఐక్యరాజ్యసమితి ప్రతినిధివర్గం ఆలోచిస్తున్నట్లు, సమితి ప్రతినిధులు త్వరలో ఢిల్లీకి రాగలరని లండన్ పత్రికలు ప్రకటించాయి

—హైద్రాబాద్ ఆంధ్రజిల్లాలతో సహా విశాలాంధ్ర నిర్మాణమే హైద్రాబాద్ ప్రదేశ్ కాంగ్రెస్ లక్ష్యమని ప్రధాన కార్యదర్శి మాడపాటి రామచంద్రరావుగారు తెలిపారు

—కాశ్మీరు రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలు సెప్టెంబరులో జరుగగలవని షేక్ అబ్దుల్లా ప్రకటించారు

—ఐర్ పార్లమెంటుకు జరిగిన ఎన్నికలలో మొత్తము 147 సభ్యస్థానాల్లో మాజీ ప్రధాని డీవేలరాపార్టీకి 69 స్థానాలు, ప్రస్తుత ప్రధాని కాస్టెల్లోపార్టీకి 40 స్థానాలు వచ్చాయి ఇతర అభిమానులతో కలుపుకుని డీవలరాకు 74 స్థానాలబలం, కాస్టెల్లోకు 73 స్థానాలబలం లభించి ప్రభుత్వనిర్మాణంసమస్యగా పరిణమించింది.

—ఫక్తూనిస్థాన్ సమస్యను న్యాయముగా శీఘ్రముగా పరిష్కరించు మార్గము సూచించి ఫక్తూన్లకు, పాకిస్థాన్‌కు యుద్ధం జరక్కుండాచేయాలని, పాకిస్థాన్ పరిపాలనకు తాము తలఒగ్గమని, అ భా. ఫక్తూన్ సభాధ్యక్షుడు మౌలానా మహమ్మద్ అక్బర్ ఖాన్ ప్రపంచ అగ్రరాజ్యాలకు విజ్ఞప్తి చేశారు

—అ భా కాంగ్రెసు ఎన్నికల ట్రిబ్యునల్‌కు బక్షీ టేక్ చందు (అధ్యక్షుడు) దేవదాసు గాంధి, రాజాఅయ్యర, శ్రీమతి దుర్గాబాయి, వేదవ్యాస్ (కార్యదర్శి) గార్లు, క్రెడెంషల్స్ కమిటీకి లాలా అచింతరాల (సమావేశకర్త) బ్రజకృషక్ చందివాలా, వియోగహరి గార్లు నియమితులయ్యారు

—కొరియా తగాదా సవ్యంగా, నిజంగా, పరిష్కారమయ్యే అవకాశముంటే 38 వ అక్షాంశరేఖ హద్దుగా యుద్ధ విరమణకు అమెరికా అంగీకరించవచ్చని, అయితే సంధి షరతులలో సమితిలో పెకింగ్‌కు ప్రాతినిధ్యము, ఫార్మోజా భవిష్యత్తు సమస్యలను చేర్చనివ్వమనీ అమెరికన్ విదేశాంగకార్యదర్శి ఎచిసన్ ప్రకటించాడు

—నూనె తగాదాను బ్రిటిష్ ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపి పరిష్కరించుకోవలసిందని అధ్యక్షుడు ట్రూమన్ ఇచ్చిన సలహాను పర్షియాప్రధాని డా॥ మొసాదిక్ తిరస్కరించాడు ఆంగ్లో-ఇరానియన్ కంపెనీ నియమించే ఏ రాయబారవర్గంతోనైనా, ఆఖరికి ఒక బ్రిటిష్ మంత్రిని అందులో సభ్యునిగా నియమించినా, సంప్రదింపులు జరపడానికి తాము సిద్ధంగా ఉన్నట్లు ఆయన స్పష్టంచేశాడు.

## ఆదివారం, జూన్ 3

—58 గురు చేనేత సత్యాగ్రహులు అరెస్టయ్యారు

—ఇండియాలోని వివిధప్రాంతాల్లోని సోషలిస్టులు 20 వేలమంది ఢిల్లీలో ఊరేగింపు జరిపి 'ప్రజాభీష్ట ప్రణాళిక' నొకదాన్ని అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్‌కు సమర్పించారు

—ప్రధాని నెహ్రూ ఢిల్లీనుండి శ్రీనగర్‌కు విజయం చేశారు

—కొరియా మధ్యరంగ పశ్చిమభాగానా, తూర్పుభాగాన ఐక్యరాజ్య సైన్యాలు ఉత్తర కొరియాలోకి మరికొంత దూరం చొచ్చుకుపోయాయి హ్వాచాన్, యాంగు, ఇంజిప్రాంతాల్లో కమ్యూనిస్టు ప్రతిఘటన తీవ్రమౌతోంది ★

# రాజ్యాంగ సవరణల విజయం

(2 వ పేజీ తరువాయి)

కూలంగా రాజ్యాంగాన్ని సవరణ చేయడానికి ఆయన అభ్యంతరం చెప్పలేదుగాని వాక్స్వాతంత్ర్యాన్ని అరికట్టడానికి ఆయన ఒప్పుకోలేదు ప్రజలు నాయకులను ఆరాధించబట్టే ఈ ప్రభుత్వం ఇంతకాలం నిలబడిఉందని కూడా కృపలానీ ఆరోపించారు దేశానికి ప్రధానంగా కావలసినవి తిండీ, బట్టా అని, వాటిని ప్రభుత్వం సరిగా అందజేయడానికి బదులు రాజ్యాంగాన్ని సంస్కరిస్తున్నదనీ కూడా కృపలానీ విమర్శించారు

డా. హృదయనాథ కుంజ్రూ, ప్రొ. కే. టీ. షా మొదలైనవారు కూడా రాజ్యాంగ సవరణకు వ్యతిరేకంగా మాట్లాడుతూ విమర్శించారు

బిల్లును వ్యతిరేకించినవారు చేసిన విమర్శలలో చాలా నిజం ఉన్నప్పటికీ అందులో కేవల ప్రతిపక్షీయుల ధోరణి - ప్రభుత్వాన్ని విమర్శించే అవకాశం వినియోగించుకోవాలన్న ధోరణి - అక్కడక్కడ లేకపోలేదు ఉదాహరణకు, కృపాలనీ మాట్లాడుతూ, "ఈ రాజ్యాంగాన్ని రక్షిస్తామని రిపబ్లిక్ అధ్యక్షుడూ, మంత్రులూ ప్రమాణంచేశారు రాజ్యాంగాన్ని ఇంత సులభంగా మార్చగలిగినట్లయితే వారు దేనికి ప్రమాణం చేశారో నాకు తెలియకుండా ఉన్నది," అనీకూడా, జమీందారీల రద్దుకు తోడ్పడినంతవరకు రాజ్యాంగాన్ని మార్చడం తనకు సమ్మతమే నన్నారు

అయితే ఈ రాజ్యాంగ సవరణలో గల దౌర్బల్యాన్ని "ప్రతిపక్షులే" గాక ప్రభుత్వపక్షీయులు కూడా తమ సమర్థనలలో వ్యక్తీకరించారు హోం మంత్రి సి. రాజగోపాలాచారి 19 (2) అంశంయొక్క సవరణను సమర్థించుతూ పత్రికలు అనవసరంగా కంగారుపడుతున్నాయనీ, పత్రికలపై ఈ సవరణ ఆయుధంగా ప్రయోగించే ఉద్దేశం లేదనీ, అది అలా ప్రయోగించబడదనీ, అసలిది ఆయుధమే కాదనీ అన్నారు! నెహ్రూ సమర్థనలాగే, రాజాజీ, అంబేద్కర్ మొదలైనవారి సమర్థనకూడా చాలా బలహీనంగా ఉన్నాయి సామాన్య ప్రజల దృష్టినుంచి చూస్తే ఈ సవరణలు నెగ్గడంవల్ల ప్రభుత్వంమీద అనుమానాలు హెచ్చుతాయి గాని తగ్గవు

కాశ్మీరు జాతీయ మహాసభలో మాట్లాడుతూ కాశ్మీరు ప్రధాని షేక్ అబ్దుల్లా శనివారంనాడు, రాజ్యాంగపరిషత్తుకొరకు రాగల సెప్టెంబరులో ఎన్నికలు జరుగుతాయన్నాడు

## కాశ్మీర్

షేక్ అబ్దుల్లాగాని, జాతీయ మహాసభగాని ఈ నిర్ణయంచేయడం స్వాభావికమే కాశ్మీరు సంస్థానాన్ని నయాన తనతో చేర్చుకోలేక కొండజాతులవాళ్ళను అడ్డం పెట్టుకొని పాకిస్తాను కాశ్మీరుపై అక్రమంగా దాడిచేయడంవల్ల ఏర్పడిన సమస్యను ఈ నాలుగేళ్ళకాలంలోనూ భద్రతామండలి పరిష్కరించకపోగా, దీని పరిష్కారానికి జరిగిన ప్రయత్నాలు ప్రజాస్వామికం దృష్ట్యా హేయమైనవిగా ఉన్నాయి భద్రతామండలిగాని, కాశ్మీరు సమస్యపట్ల అధికమైనఆసక్తికనబరుస్తూ ప్రత్యక్షంగానూ పరోక్షంగాను పాకిస్తానుకు అన్నివిధాలా సాయపడే అమెరికా బ్రిటనులుగాని కాశ్మీరుసమస్య పరిష్కారం కాకుండా నిలిచిపోయిందే అన్నవిచారాన్ని వెలిబుచ్చలేదు కాని కాశ్మీరులో ప్రజాస్వామిక సూత్రాలపై వయోజన వోటింగు విధానంతో రాజ్యాంగ పరిషత్తు ఏర్పడడం మటుకు వారికి ఎంతో కంటకింపుగా ఉన్నది ఒకప్పుడు, కాశ్మీరు మధ్యవర్తి తన అధికారాలను కాశ్మీరు ప్రభుత్వం వద్దనుండి పొందాలని ఆదేశించిన భద్రతామండలే, కొంతకాలం గడిచాక కాశ్మీరు ప్రభుత్వం వైదొలగిన పిమ్మట జనవాక్యనిర్ధారణ జరగాలన్నట్టుగానే, కాశ్మీరు ఇండియాతో చేరడాన్ని గుర్తించి నిరాకరించే భద్రతామండలి రాజ్యాంగ పరిషత్తు ఏర్పడకుండా చూడమని ఇండియా ప్రభుత్వాన్ని కోరుతోంది కాశ్మీరు రాజ్యాంగ పరిషత్తు ఏర్పడడం కాశ్మీరు సమస్యాపరిష్కారానికి ఏవిధంగా పెద్ద అవాంతరమయేదీ భద్రతామండలి వివరించవలసి ఉన్నది

ఐక్యరాజ్యసమితిద్వారా తమ రాజకీయసమస్య పరిష్కారం కాకపోవడం కాశ్మీరీల తప్పుకాదు వారు నిరవధికంగా తాత్కాలిక ప్రభుత్వంతో, రాజ్యాంగం లేకుండా, రాజకీయ పరిణామాలన్నిటికీ స్వస్తిచెప్పి ఐక్యరాజ్య సమితి తీర్పుకొరకు ఎదురుతెన్నులు చూస్తూ కూర్చోలేరు రాజ్యాంగ పరిషత్తు ఏర్పాటవుతుంది ఇండియాతో కాశ్మీరు చేరికను గురించి ఆ పరిషత్తు తన నిర్ణయాన్ని ప్రకటస్తుంది రాజ్యాంగం ఏర్పాటు చేసుకుని దానికింద రాజకీయ, ఆర్థిక, సాంఘిక సంస్కరణలు సాగిస్తూ కాశ్మీరుప్రజలు ముందుకు పోతారు ఇది కాశ్మీరుప్రజల న్యాయమైన హక్కు కాశ్మీరురాజ్యాంగ పరిషత్తు ఇండియాతో కాశ్మీరుచేరికను బలపరుస్తుందేమో నన్న భయంగలవారు తప్ప ఇంకెవరూ రాజ్యాంగ పరిషత్తుకు అభ్యంతరం చెప్పనవసరంలేదు అట్టి భయం పాకిస్తానుకు ఉండడం స్వాభావికమే కాశ్మీరును యుద్ధంచేసి అయినా గెలవాలని పాకిస్తాను బహిరంగంగా చెబుతున్నది కాశ్మీరు ప్రజల హక్కులపట్ల పాకిస్తాను ఏనాడూ గౌరవం చూపలేదు అట్టి పాకిస్తానును సమర్థించుతూ అమెరికా, బ్రిటనులూ, వాటికి అనుగుణంగా భద్రతామండలీ వ్యవహరిస్తున్నాయి పాకిస్తాను దురాక్రమణ ఏనాడో రుజువయినప్పటికీ పాకిస్తానుపై భద్రతామండలి ఎట్టి చర్యా తలపెట్టకపోవడమే దానికి నిదర్శనం అందుచేత కాశ్మీరు రాజ్యాంగపరిషత్తును గురించి భద్రతామండలి ప్రకటించే వైఖరిని ప్రపంచం హర్షించదు. 



Regd No. M 4479

# శ్రీమద్భగవద్గీత

## వ్యాఖ్యాత: శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారు



ఆరవ ముద్రణము

సంస్కృతమూలము, తెలుగున టీకాతాత్పర్య విశేషార్థ వివరణములు గల 400 పుటల గ్రంథము. గీతాధ్యయన పరులకు మిక్కిలి ఉపయుక్తమైనది.





ఖద్దరు బైండు

**వెల రు 4-0-0 లు.**

తపాలాఖర్చు రు 0-10-0



## ఆంధ్రగ్రంథమాల

పోస్టుబాక్సు 212, మదరాసు 1.

Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras